THE LARGEST CIRCULATED PANCHANG
IN ANDHRA PRADESH & TELANGANA

36 Since 1990

110 సం॥ల భూత,భవిష్యద్వర్తమాన శతాబ్ది పంచాంగ రచయిత

పండిత డా॥ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ విశ్వావసు నామ సంవత్సర

# గంటల పంచాంగము

**2025** **2026**

36 సం॥లుగా ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రాలలో అత్యధిక సర్క్యులేషన్, ప్రజాదరణ కలిగిన పంచాంగము

ప్రతిరోజు చంద్రుని స్థితి తెలుపు బొమ్మలతో

రాబోవు శ్రీ పరాభవ నామ సం॥లో వివాహాది శుభ ముహూర్తములతో



పండిత డా॥ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ శ్రీశైల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతి



వసుంధర పబ్లికేషన్స్, విజయవాడ-2.

VASUNDHARA PUBLICATIONS

వెల రూ.93

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ గారి

## శ్రీ విశ్వావసునామ సంవత్సర గంటల పంచాంగము 2025-2026

కలియుగాబ్దములు - 5126, విక్రమార్కశకాబ్దములు - 2082, శాలివాహనశకాబ్దములు - 1947, శ్రీశంకరాచార్యాబ్దములు - 2097, రామానుజాబ్దములు -1008, హూణశకము-2025-2026, హిజరీశతాబ్దములు -1446-47, ప్రభవాదిగతాబ్దములు - 38



**శ్రీ లక్ష్మీగణపతయే నమః సర్వేజనాః సుఖినోభవంతు**

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోప శాంతయే

శ్లో॥ ఆదిత్యాయ సోమాయ మంగళాయ బుధాయచ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః

## నవగ్రహ ధ్యాన శ్లోకములు



**రవి** : జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మి దివాకరం



**చంద్ర** : దధిశంఖ తుషారాభం క్షీరోదార్ణవ సంభవం
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం



**కుజ** : ధరణీ గర్భసంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహమ్



**బుధ** : ప్రియంగుకళికాశ్యామం రూపేణా ప్రతిమం బుధం
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్



**గురు** : దేవానాంచ ఋషీనాంచ గురుం కాంచన సన్నిభం
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిం



**శుక్ర** : హిమకుంద మృణాలాభం దైత్యానాం పరమంగురుం
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్



**శని** : నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్
ఛాయామార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరం



**రాహువు** : అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్దనమ్
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్



**కేతువు** : ఫలాశ పుష్ప సంకాశం తారకాగ్రహ మస్తకమ్
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్

ఈ శ్లోకములు పఠించుటవలన గ్రహదోషములు తొలగును.

FORM - 1

**వసుంధర పబ్లికేషన్స్,** 30-6-8/1, అనపర్తివారివీధి, దుర్గా అగ్రహారం, విజయవాడ-2. సెల్: 98481 71785

## శ్రావణ మాసం

| శుక్ల పాడ్యమి<br>జూలై 25<br>శుక్రవారం | శుక్ల విదియ<br>జూలై 26<br>శనివారం | శుక్ల తదియ<br>జూలై 27<br>ఆదివారం | శుక్ల చవితి<br>జూలై 28<br>సోమవారం | శుక్ల పంచమి<br>జూలై 29<br>మంగళ | శుక్ల షష్ఠి<br>జూలై 30<br>బుధవారం | శుక్ల సప్తమి<br>జూలై 31<br>గురువారం | శుక్ల అష్టమి<br>ఆగష్టు 1<br>శుక్రవారం | శుక్ల నవమి<br>ఆగష్టు 2<br>శనివారం | శుక్ల దశమి<br>ఆగష్టు 3<br>ఆదివారం | శుక్ల ఏకాదశి<br>ఆగష్టు 4<br>సోమవారం | శుక్ల ద్వాదశి<br>ఆగష్టు 5<br>మంగళ | శుక్ల త్రయోదశి<br>ఆగష్టు 6<br>బుధవారం | శుక్ల చతుర్దశి<br>ఆగష్టు 7<br>గురువారం | పూర్ణిమ<br>ఆగష్టు 8<br>శుక్రవారం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కృష్ణ పాడ్యమి<br>ఆగష్టు 9<br>శనివారం | కృష్ణ విదియ<br>ఆగష్టు 10<br>ఆదివారం | కృష్ణ తదియ<br>ఆగష్టు 11<br>సోమవారం | కృష్ణ చవితి<br>ఆగష్టు 12<br>మంగళ | కృష్ణ పంచమి<br>ఆగష్టు 13<br>బుధవారం | కృష్ణ షష్ఠి<br>ఆగష్టు 14<br>గురువారం | కృష్ణ సప్తమి<br>ఆగష్టు 15<br>శుక్రవారం | కృష్ణ అష్టమి<br>ఆగష్టు 16<br>శనివారం | కృష్ణ నవమి<br>ఆగష్టు 17<br>ఆదివారం | కృష్ణ దశమి<br>ఆగష్టు 18<br>సోమవారం | కృష్ణ ఏకాదశి<br>ఆగష్టు 19<br>మంగళ | కృష్ణ ద్వాదశి<br>ఆగష్టు 20<br>బుధవారం | కృష్ణ త్రయోదశి<br>ఆగష్టు 21<br>గురువారం | కృష్ణ చతుర్దశి<br>ఆగష్టు 22<br>శుక్రవారం | అమావాస్య<br>ఆగష్టు 23<br>శనివారం |

## భాద్రపద మాసం

| శుక్ల పాడ్యమి<br>ఆగష్టు 24<br>ఆదివారం | శుక్ల విదియ<br>ఆగష్టు 25<br>సోమవారం | శుక్ల తదియ<br>ఆగష్టు 26<br>మంగళ | శుక్ల చవితి<br>ఆగష్టు 27<br>బుధవారం | శుక్ల పంచమి<br>ఆగష్టు 28<br>గురువారం | శుక్ల షష్ఠి<br>ఆగష్టు 29<br>శుక్రవారం | శుక్ల సప్తమి<br>ఆగష్టు 30<br>శనివారం | శుక్ల అష్టమి<br>ఆగష్టు 31<br>ఆదివారం | శుక్ల నవమి<br>సెప్టెంబర్ 1<br>సోమవారం | శుక్ల దశమి<br>సెప్టెంబర్ 2<br>మంగళ | శుక్ల ఏకాదశి<br>సెప్టెంబర్ 3<br>బుధవారం | శుక్ల ద్వాదశి<br>సెప్టెంబర్ 4<br>గురువారం | శుక్ల త్రయోదశి<br>సెప్టెంబర్ 5<br>శుక్రవారం | శుక్ల చతుర్దశి<br>సెప్టెంబర్ 6<br>శనివారం | పూర్ణిమ గ్రహణం<br>సెప్టెంబర్ 7<br>ఆదివారం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కృష్ణ పాడ్యమి<br>సెప్టెంబర్ 8<br>సోమవారం | కృష్ణ విదియ<br>సెప్టెంబర్ 9<br>మంగళ | కృష్ణ తదియ<br>సెప్టెంబర్ 10<br>బుధవారం | కృష్ణ చవితి<br>సెప్టెంబర్ 11<br>గురువారం | కృష్ణ పంచమి<br>సెప్టెంబర్ 12<br>శుక్రవారం | కృష్ణ [illegible]<br>సెప్టెంబర్ 13<br>శనివారం | కృష్ణ [illegible]<br>సెప్టెంబర్ 14<br>ఆదివారం | కృష్ణ నవమి<br>సెప్టెంబర్ 15<br>సోమవారం | కృష్ణ దశమి<br>సెప్టెంబర్ 16<br>మంగళ | కృష్ణ ఏకాదశి<br>సెప్టెంబర్ 17<br>బుధవారం | కృష్ణ ద్వాదశి<br>సెప్టెంబర్ 18<br>గురువారం | కృష్ణ త్రయోదశి<br>సెప్టెంబర్ 19<br>శుక్రవారం | కృష్ణ చతుర్దశి<br>సెప్టెంబర్ 20<br>శనివారం | అమావాస్య<br>సెప్టెంబర్ 21<br>ఆదివారం | చంద్రగ్రహణం |



## ఆశ్వయుజ మాసం

| శుక్ల పాడ్యమి<br>సెప్టెంబర్ 22<br>సోమవారం | శుక్ల విదియ<br>సెప్టెంబర్ 23<br>మంగళ | శుక్ల తదియ<br>సెప్టెంబర్ 24<br>బుధవారం | శుక్ల చవితి<br>సెప్టెంబర్ 25<br>గురువారం | శుక్ల పంచమి<br>సెప్టెంబర్ 26<br>శుక్రవారం | శుక్ల షష్ఠి<br>సెప్టెంబర్ 27<br>శనివారం | శుక్ల సప్తమి<br>సెప్టెంబర్ 28<br>ఆదివారం | శుక్ల అష్టమి<br>సెప్టెంబర్ 29<br>సోమవారం | శుక్ల నవమి<br>సెప్టెంబర్ 30<br>మంగళ | శుక్ల దశమి<br>అక్టోబర్ 1<br>బుధవారం | శుక్ల ఏకాదశి<br>అక్టోబర్ 2<br>గురువారం | శుక్ల ద్వాదశి<br>అక్టోబర్ 3<br>శుక్రవారం | శుక్ల త్రయోదశి<br>అక్టోబర్ 4<br>శనివారం | శుక్ల చతుర్దశి<br>అక్టోబర్ 5<br>ఆదివారం | పూర్ణిమ<br>అక్టోబర్ 6<br>సోమవారం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చంద్రగ్రహణం | కృష్ణ విదియ<br>అక్టోబర్ 8<br>బుధవారం | కృష్ణ తదియ<br>అక్టోబర్ 9<br>గురువారం | కృష్ణ చవితి<br>అక్టోబర్ 10<br>శుక్రవారం | కృష్ణ పంచమి<br>అక్టోబర్ 11<br>శనివారం | కృష్ణ షష్ఠి<br>అక్టోబర్ 12<br>ఆదివారం | కృష్ణ సప్తమి<br>అక్టోబర్ 13<br>సోమవారం | కృష్ణ అష్టమి<br>అక్టోబర్ 14<br>మంగళ | కృష్ణ నవమి<br>అక్టోబర్ 15<br>బుధవారం | కృష్ణ దశమి<br>అక్టోబర్ 16<br>గురువారం | కృష్ణ ఏకాదశి<br>అక్టోబర్ 17<br>శుక్రవారం | కృష్ణ ద్వాదశి<br>అక్టోబర్ 18<br>శనివారం | కృష్ణ త్రయోదశి<br>అక్టోబర్ 19<br>ఆదివారం | కృష్ణ చతుర్దశి<br>అక్టోబర్ 20<br>సోమవారం | అమావాస్య<br>అక్టోబర్ 21<br>మంగళ |

## కార్తిక మాసం

| శుక్ల పాడ్యమి<br>అక్టోబర్ 22<br>బుధవారం | శుక్ల విదియ<br>అక్టోబర్ 23<br>గురువారం | శుక్ల తదియ<br>అక్టోబర్ 24<br>శుక్రవారం | శుక్ల చవితి<br>అక్టోబర్ 25<br>శనివారం | శుక్ల పంచమి<br>అక్టోబర్ 26<br>ఆదివారం | శుక్ల షష్ఠి<br>అక్టోబర్ 27<br>సోమవారం | శుక్ల సప్తమి<br>అక్టోబర్ 28<br>మంగళ | శుక్ల అష్టమి<br>అక్టోబర్ 29<br>బుధవారం | శుక్ల నవమి<br>అక్టోబర్ 30<br>గురువారం | శుక్ల దశమి<br>అక్టోబర్ 31<br>శుక్రవారం | శుక్ల ఏకాదశి<br>నవంబర్ 1<br>శనివారం | శుక్ల ద్వాదశి<br>నవంబర్ 2<br>ఆదివారం | శుక్ల త్రయోదశి<br>నవంబర్ 3<br>సోమవారం | శుక్ల చతుర్దశి<br>నవంబర్ 4<br>మంగళ | పూర్ణిమ<br>నవంబర్ 5<br>బుధవారం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కృష్ణ పాడ్యమి<br>నవంబర్ 6<br>గురువారం | కృష్ణ విదియ<br>నవంబర్ 7<br>శుక్రవారం | కృష్ణ తదియ<br>నవంబర్ 8<br>శనివారం | కృష్ణ చవితి<br>నవంబర్ 9<br>ఆదివారం | కృష్ణ పంచమి<br>నవంబర్ 10<br>సోమవారం | కృష్ణ [illegible]<br>నవంబర్ 11<br>మంగళ | కృష్ణ [illegible]<br>నవంబర్ 12<br>బుధవారం | కృష్ణ నవమి<br>నవంబర్ 13<br>గురువారం | కృష్ణ దశమి<br>నవంబర్ 14<br>శుక్రవారం | కృష్ణ ఏకాదశి<br>నవంబర్ 15<br>శనివారం | కృష్ణ ద్వాదశి<br>నవంబర్ 16<br>ఆదివారం | కృష్ణ త్రయోదశి<br>నవంబర్ 17<br>సోమవారం | కృష్ణ చతుర్దశి<br>నవంబర్ 18<br>మంగళ | కృష్ణ చతుర్దశి<br>నవంబర్ 19<br>బుధవారం | అమావాస్య<br>నవంబర్ 20<br>గురువారం |



Scanned with OKEN Scanner

## మార్గశిర మాసం

| తిథి | తేదీ | వారం |
|---|---|---|
| శుక్ల పాడ్యమి | నవంబర్ 21 | శుక్రవారం |
| శుక్ల విదియ | నవంబర్ 22 | శనివారం |
| శుక్ల తదియ | నవంబర్ 23 | ఆదివారం |
| శుక్ల చవితి | నవంబర్ 24 | సోమవారం |
| శుక్ల పంచమి | నవంబర్ 25 | మంగళ |
| శుక్ల షష్ఠి | నవంబర్ 26 | బుధవారం |
| శుక్ల సప్తమి | నవంబర్ 27 | గురువారం |
| శుక్ల అష్టమి | నవంబర్ 28 | శుక్రవారం |
| శుక్ల నవమి | నవంబర్ 29 | శనివారం |
| శుక్ల దశమి | నవంబర్ 30 | ఆదివారం |
| శుక్ల ఏకాదశి | డిశంబర్ 1 | సోమవారం |
| శుక్ల ద్వాదశి | డిశంబర్ 2 | మంగళ |
| శుక్ల త్రయోదశి | డిశంబర్ 3 | బుధవారం |
| పూర్ణిమ | డిశంబర్ 4 | గురువారం |
| కృష్ణ పాడ్యమి | డిశంబర్ 5 | శుక్రవారం |
| కృష్ణ విదియ | డిశంబర్ 6 | శనివారం |
| కృష్ణ తదియ | డిశంబర్ 7 | ఆదివారం |
| కృష్ణ చవితి | డిశంబర్ 8 | సోమవారం |
| కృష్ణ పంచమి | డిశంబర్ 9 | మంగళ |
| కృష్ణ షష్ఠి | డిశంబర్ 10 | బుధవారం |
| కృష్ణ సప్తమి | డిశంబర్ 11 | గురువారం |
| కృష్ణ అష్టమి | డిశంబర్ 12 | శుక్రవారం |
| కృష్ణ నవమి | డిశంబర్ 13 | శనివారం |
| కృష్ణ దశమి | డిశంబర్ 14 | ఆదివారం |
| కృష్ణ ఏకాదశి | డిశంబర్ 15 | సోమవారం |
| కృష్ణ ద్వాదశి | డిశంబర్ 16 | మంగళ |
| కృష్ణ త్రయోదశి | డిశంబర్ 17 | బుధవారం |
| కృష్ణ చతుర్దశి | డిశంబర్ 18 | గురువారం |
| అమావాస్య | డిశంబర్ 19 | శుక్రవారం |

## పుష్య మాసం

| తిథి | తేదీ | వారం |
|---|---|---|
| శుక్ల పాడ్యమి | డిశంబర్ 20 | శనివారం |
| శుక్ల విదియ | డిశంబర్ 21 | ఆదివారం |
| శుక్ల తదియ | డిశంబర్ 22 | సోమవారం |
| శుక్ల చవితి | డిశంబర్ 23 | మంగళ |
| శుక్ల పంచమి | డిశంబర్ 24 | బుధవారం |
| శుక్ల షష్ఠి | డిశంబర్ 25 | గురువారం |
| శుక్ల సప్తమి | డిశంబర్ 26 | శుక్రవారం |
| శుక్ల అష్టమి | డిశంబర్ 27 | శనివారం |
| శుక్ల నవమి | డిశంబర్ 28 | ఆదివారం |
| శుక్ల దశమి | డిశంబర్ 29 | సోమవారం |
| శుక్ల ఏకాదశి | డిశంబర్ 30 | మంగళ |
| శుక్ల ద్వాదశి | డిశంబర్ 31 | బుధవారం |
| శుక్ల త్రయోదశి | 2026 జనవరి 1 | గురువారం |
| శుక్ల చతుర్దశి | జనవరి 2 | శుక్రవారం |
| పూర్ణిమ | జనవరి 3 | శనివారం |
| కృష్ణ పాడ్యమి | జనవరి 4 | ఆదివారం |
| కృష్ణ విదియ | జనవరి 5 | సోమవారం |
| కృష్ణ తదియ | జనవరి 6 | మంగళ |
| కృష్ణ చవితి | జనవరి 7 | బుధవారం |
| కృష్ణ పంచమి | జనవరి 8 | గురువారం |
| కృష్ణ షష్ఠి | జనవరి 9 | శుక్రవారం |
| కృష్ణ సప్తమి | జనవరి 10 | శనివారం |
| కృష్ణ అష్టమి | జనవరి 11 | ఆదివారం |
| కృష్ణ నవమి | జనవరి 12 | సోమవారం |
| కృష్ణ దశమి | జనవరి 13 | మంగళ |
| కృష్ణ ఏకాదశి | జనవరి 14 | బుధవారం |
| కృష్ణ ద్వాదశి | జనవరి 15 | గురువారం |
| కృష్ణ త్రయోదశి | జనవరి 16 | శుక్రవారం |
| కృష్ణ చతుర్దశి | జనవరి 17 | శనివారం |
| అమావాస్య | జనవరి 18 | ఆదివారం |



## మాఘ మాసం

| తిథి | తేదీ | వారం |
|---|---|---|
| శుక్ల పాడ్యమి | జనవరి 19 | సోమవారం |
| శుక్ల విదియ | జనవరి 20 | మంగళ |
| శుక్ల తదియ | జనవరి 21 | బుధవారం |
| శుక్ల చవితి | జనవరి 22 | గురువారం |
| శుక్ల పంచమి | జనవరి 23 | శుక్రవారం |
| శుక్ల షష్ఠి | జనవరి 24 | శనివారం |
| శుక్ల సప్తమి | జనవరి 25 | ఆదివారం |
| శుక్ల అష్టమి | జనవరి 26 | సోమవారం |
| శుక్ల నవమి | జనవరి 27 | మంగళ |
| శుక్ల దశమి | జనవరి 28 | బుధవారం |
| శుక్ల ఏకాదశి | జనవరి 29 | గురువారం |
| శుక్ల ద్వాదశి | జనవరి 30 | శుక్రవారం |
| శుక్ల చతుర్దశి | జనవరి 31 | శనివారం |
| పూర్ణిమ | ఫిబ్రవరి 1 | ఆదివారం |
| కృష్ణ పాడ్యమి | ఫిబ్రవరి 2 | సోమవారం |
| కృష్ణ విదియ | ఫిబ్రవరి 3 | మంగళ |
| కృష్ణ తదియ | ఫిబ్రవరి 4 | బుధవారం |
| కృష్ణ చవితి | ఫిబ్రవరి 5 | గురువారం |
| కృష్ణ పంచమి | ఫిబ్రవరి 6 | శుక్రవారం |
| కృష్ణ షష్ఠి | ఫిబ్రవరి 7 | శనివారం |
| కృష్ణ సప్తమి | ఫిబ్రవరి 8 | ఆదివారం |
| కృష్ణ అష్టమి | ఫిబ్రవరి 9 | సోమవారం |
| కృష్ణ నవమి | ఫిబ్రవరి 11 | బుధవారం |
| కృష్ణ దశమి | ఫిబ్రవరి 12 | గురువారం |
| కృష్ణ ఏకాదశి | ఫిబ్రవరి 13 | శుక్రవారం |
| కృష్ణ ద్వాదశి | ఫిబ్రవరి 14 | శనివారం |
| కృష్ణ త్రయోదశి | ఫిబ్రవరి 15 | ఆదివారం |
| కృష్ణ చతుర్దశి | ఫిబ్రవరి 16 | సోమవారం |
| అమావాస్య | ఫిబ్రవరి 17 | మంగళ |

## ఫాల్గుణ మాసం

| తిథి | తేదీ | వారం |
|---|---|---|
| శుక్ల పాడ్యమి | ఫిబ్రవరి 18 | బుధవారం |
| శుక్ల విదియ | ఫిబ్రవరి 19 | గురువారం |
| శుక్ల తదియ | ఫిబ్రవరి 20 | శుక్రవారం |
| శుక్ల చవితి | ఫిబ్రవరి 21 | శనివారం |
| శుక్ల పంచమి | ఫిబ్రవరి 22 | ఆదివారం |
| శుక్ల షష్ఠి | ఫిబ్రవరి 23 | సోమవారం |
| శుక్ల సప్తమి | ఫిబ్రవరి 24 | మంగళ |
| శుక్ల నవమి | ఫిబ్రవరి 25 | బుధవారం |
| శుక్ల దశమి | ఫిబ్రవరి 26 | గురువారం |
| శుక్ల ఏకాదశి | ఫిబ్రవరి 27 | శుక్రవారం |
| శుక్ల ద్వాదశి | ఫిబ్రవరి 28 | శనివారం |
| శుక్ల త్రయోదశి | మార్చి 1 | ఆదివారం |
| శుక్ల చతుర్దశి | మార్చి 2 | సోమవారం |
| పూర్ణిమ గ్రహణం | మార్చి 3 | మంగళ |
| కృష్ణ పాడ్యమి | మార్చి 4 | బుధవారం |
| కృష్ణ విదియ | మార్చి 5 | గురువారం |
| కృష్ణ తదియ | మార్చి 6 | శుక్రవారం |
| కృష్ణ చవితి | మార్చి 7 | శనివారం |
| కృష్ణ పంచమి | మార్చి 8 | ఆదివారం |
| కృష్ణ షష్ఠి | మార్చి 9 | సోమవారం |
| కృష్ణ సప్తమి | మార్చి 10 | మంగళ |
| కృష్ణ అష్టమి | మార్చి 11 | బుధవారం |
| కృష్ణ నవమి | మార్చి 12 | గురువారం |
| కృష్ణ దశమి | మార్చి 13 | శుక్రవారం |
| కృష్ణ ఏకాదశి | మార్చి 14 | శనివారం |
| కృష్ణ ద్వాదశి | మార్చి 15 | ఆదివారం |
| కృష్ణ త్రయోదశి | మార్చి 16 | సోమవారం |
| కృష్ణ చతుర్దశి | మార్చి 17 | మంగళ |
| అమావాస్య | మార్చి 18 | బుధవారం |

శ్రీరస్తు శుభమస్తు శ్రీ వీరభద్ర దైవజ్ఞ నమః

# శ్రీ విశ్వావసునామ సంవత్సర ఫలము 2025 - 2026

ఈ సంవత్సరం రాజు, సైన్యాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి-సూర్యుడు. మంత్రి-చంద్రుడు. సస్యాధిపతి-గురుడు. ధాన్యాధిపతి-కుజుడు. రసాధిపతి-శని. నీరసాధిపతి-బుధుడు. ఈ నవనాయకులలో పాపులకు 6 ఆధిపత్యములు, శుభులకు 3 ఆధిపత్యాలు వచ్చుటచే దేశములోనూ, రాష్ట్రములోను పరిపాలన సజావుగా నడవదు. ప్రతీ రోజు పాలకులు ఏదో ఒక సమస్యను ఎదుర్కొనవలసి వచ్చును. సంక్షేమ పథకాలు అమలు చేయలేక ప్రజలలో తీవ్ర వ్యతిరేకతవచ్చును. నూతనపరిశ్రమలు వచ్చుటకు తీవ్ర ప్రయత్నాలు చేయుదురు. పూర్తిగా సఫలీకృతులుకాలేరు. ఆర్థికసమస్యలు ఎక్కువగానుం డును. కేంద్ర సహాయం అందినప్పటికీ తీవ్రఇబ్బందులుఎదుర్కొంటారు. ప్రతీ వస్తువుకు ధరలు పెరుగుటచే అభివృద్ధి కుంటుపడును. రియల్ ఎస్టేట్‌రంగం, భవననిర్మాణరంగం వృద్ధిలోనుండును. ప్రపంచం అంతటా ఆర్థికమాంద్యం ఉంటుంది. కొన్నిదేశాలు అట్ట డుగు స్థాయికి పోవును. సరిహద్దుదేశాలతో యుద్ధవాతావరణం ఉంటుంది. మనసైని కులు చాకచక్యంతోఎదుర్కొంటారు. అంతరిక్షపరిశోధనలు విజయవంతమగును.

ఈ సం॥రం 2 కుంచాలవర్షం. దేశంలోనూ, రాష్ట్రంలోనూ మంచి వర్షాలుకురి యును. సగటు వర్షపాతం నమోదగును. కొన్నిమండలాలలో అధికవృష్టి, కొన్ని మండ లాలలో అనావృష్టి, దేశంలోనూ రాష్ట్రంలోనూ నదులుపొంగి ప్రవహించును. ఉత్తరా ఖాండ్‌లో ఈసంవత్సరం కూడా కొండచరియలు విరిగిపడి రహదార్లు మూతపడును. స్వల్పంగా జననష్టం ఉంటుంది. ఈ సం॥రం కూడా పిడుగుపాట్లు, మెరుపులు అధికం గానే ఉండును. మెట్టభూములు, ఇసుకనేలలు విరివిగా ఫలించును. పల్లపు భూములలో తెగుళ్ళు ఎక్కువగుటచే పంట దిగుబడి బాగా తగ్గుటచే రైతాంగం నష్టపోవుదురు. ఈ సం॥రం మిర్చి, పొగాకు,పత్తి, పూలరకాలు, గోధుమలు, పసుపు, కంద, మినువులు, పెసలు, కందులు, బొబ్బర్లు, ఆవాలు, ధనియాలు, తృణధాన్యములు, పంట దిగుబడి బాగుండును. మంచి ధరలు ఉండుటచే రైతులు సంతోషంతో ఉంటారు. అన్నిరకముల పండ్ల జాతులు బాగా ఫలించును. కాని చేతికి అందే సమయాన ఏదో ఒక రూపంలో నష్టాలు కల్గును. నూనెరకాలకు మంచి ధరలుంటాయి. కొబ్బరిపంట బాగుండును. ఫౌల్ట్రీ పరిశ్రమ అభివృద్ధి, ఆక్వాపరిశ్రమ వృద్ధిలోనుండి ఎగుమతులు బాగా జరుగును. ఈ సం॥రం కూడా ప్రకృతి వైపరీత్యములు అధికమే. మహానగరములు నీట మునుగును. 2 లేదా 3రోజులు ప్రజలు తీవ్రఇబ్బందులుఎదుర్కొంటారు. 16వీసములకు 8 వీసములు పంటఫలించును. ఉభయ తెలుగురాష్ట్రములందు జలాశయములందు నీరు సమృద్ధిగా నుండును. పశ్చిమాసియా దేశములందు యుద్ధవాతావరణం ఉంటుంది. బంగారం, వెండి, షేర్ మార్కెట్ ఒడిదుడికులుగా నుండును. మనదేశములలో ఆహార ఉత్పత్తులు పెరిగి ఇతర దేశాలకు ఎగుమతులు చేయుదురు. ఈ సం॥రం తూర్పు ఈశాన్యదేశము లందు పాకిస్తాన్, నేపాల్‌ప్రాంతములందు భూకంపంఏర్పడును. ముందుజాగ్రత్త చర్యలు తీసుకొనుట మంచిది. పశుపాలకుడు, దొడ్డి పెట్టువాడు, విడిపించువాడు యముడే అగుటవలన పాడి పరిశ్రమ బాగుంటుంది. డైయిరీ వ్యాపారులకు మంచి లాభములు వచ్చును. పాల ఉత్పత్తులు పెరుగును. పశువుల ధరలు బాగా పెరుగును. పశుగ్రాసం ధరలు విపరీతంగా ఉండును. చిన్న చిన్న డెయిరీలు అధికంగా నెలకొల్పుదురు.

రాజు సూర్యుడగుటచే వేసవికాలంలో ఉష్ణోగ్రతలు రికార్డుస్థాయిలో ఉంటాయి. ఉత్తరాది రాష్ట్రములలో అత్యధిక ఉష్ణోగ్రతలు నమోదగుటచే ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటారు. చైత్రమాసంలోనే తొలకరి వానలు ప్రారంభమగును. కృత్తిక, రోహిణి కార్తెలు ఉష్ణోగ్రతలు అధికమగును.

**మే 16 తేదీ నుండి జూన్ 4వ తేదీ వరకు కాలసర్పయోగము. గురుడు ఈ సంవత్సరం 3 రాశులలో సంచరించును. (వృషభం, మిథునం, కర్కాటకము) శని మీనరాశిలోనూ, గురుడుకీ, శని రాహువులకు షష్ఠాష్టక స్థితి వలన మరియు ఇతర దేశారిష్టయోగముల వల్ల ఊహించని సంఘటనలు జరుగును. అగ్ని ప్రమాదములు, పేరున్న వ్యక్తులకు అరిష్టము.**





# మౌఢ్య దినములు

**కర్తరి నిర్ణయం :-** ది.4-5-2025 వైశాఖశుక్లసప్తమి ఆదివారం నుండిచిన్న కర్తరి. ది.11-5-2025 వైశాఖ శుక్ల చతుర్దశి ఆదివారం నుండి ది.28-5-2025 జ్యేష్టశుక్లపాడ్యమి బుధవారంవరకు పెద్ద(నిజ)కర్తరి ఈ సమయాన కర్ర, మట్టి పనులుచేయరాదు. చిన్నకర్తరిలో కొన్ని పనులుచేయవచ్చును. పెద్ద కర్తరిలో గృహసంబంధమైన కర్ర మట్టిపనులు చేయరాదు (శ్లాబులు వేసుకోవచ్చును)

**1.గురుమూఢమి :-** ది.11-6-2025 జ్యేష్ఠ పూర్ణిమ బుధవారం నుండి ది.12-7-2025 ఆషాఢ బహుళ విదియ శనివారం వరకు గురుమూఢమి.

**2.శుక్రమూఢమి :-** ది.28-11-2025 మార్గశిరశుక్ల అష్టమి శుక్రవారం నుండిది.14-2-2026 మాఘ బహుళద్వాదశి శనివారంవరకు శుక్రమూఢమి.

**రవి ఆరుద్రా ప్రవేశకాలం :** జ్యేష్ఠబహుళద్వాదశి ఆదివారంపశునాశనము, భరణి నక్షత్రం,శుభములు, సుకర్మయోగం, సస్యవృద్ధి, తైతులకరణం, నిత్యం శుభము. పగటి సమయం పంటలకు నష్టము. ప్రపంచమునకు ఆపదలు, స్వల్పవృష్టియు కలుగును.

**ఆఢకాదిస్థితి నిర్ణయము ఫలం :** ఈ సం॥రం 2 కుంచాల వర్షం, ఈ కుంచం 60 యోజనముల విస్తీర్ణం, 100 యోజనముల ఎత్తు కల్గి దేవమానముచే లెక్కించ బడును. 10 భాగాలు సముద్రాలందు, 7 భాగాలు పర్వతాలందు, 2 భాగములు భూమియందు వర్షించును. 19.4.2025 నుండి 9.10.2025 వరకు బ్రాహ్మణ యువకుని హస్తమందు, తదుపరి 11.1.2026వరకు ముదుసలి వేశ్యహస్త మందు, తదుపరి 21.03.2026 వరకు బ్రాహ్మణ యువకుని హస్తమందు ఉండును. గాన సస్యానుకూల వర్షములు. పాడి పంటలు సమృద్ధి. ప్రజలు సుఖ సౌఖ్యములతో ఉందురు.

**పుష్కర నిర్ణయం :-** 9-5-2025 వైశాఖశుక్ల ద్వాదశి శుక్రవారం ఉ.9.05 ని॥లకు గురుడు మిథునరాశిలో ప్రవేశించును. గాన 9-5-2025 నుండి 20-5-2025వరకు (12 రోజులు) సరస్వతీ నదికి పుష్కరములు జరుగును.

**ప్రాచీన సూర్యసిద్ధాంత రీత్యా ఈ తేది సరియైనది. ఆచరించండి !!**

ఉత్తరాదిరాష్ట్రాల వారు పుష్కరాలు ఆచరించరు. వారు "కుంభమేళా" ఆచరిస్తారు. 2025 జనవరి 14 నుండి ఫిబ్రవరి నెలాఖరు వరకు అలహాబాద్ త్రివేణీ సంగమంలో కుంభమేళా మహావైభవంగా జరిగింది. రికార్డుస్థాయిలో ప్రజలు హాజరయ్యారు. అదేస్థలంలో అంతర్వాహినిగా ప్రవహిస్తున్న సరస్వతీ నదీ పుష్కరాలు జరుగుట అత్యంత ప్రాధాన్యత సంతరించుకున్నది. సరస్వతీ నది ఉత్తరాఖాండ్‌లో బదరీనాథ్, కేదార్‌నాథ్ దాటిన తదుపరి హిమాలయపర్వతములలో "మన" అను గ్రామం ఉంది. అక్కడ దగ్గరలోని "భీంపూలు" అనే గ్రామంలో సరస్వతీనది జన్మస్థలం. అక్కడ కూడా పుష్కరస్నానం చేయవచ్చును. అక్కడకుకు చేరాలంటే ఢిల్లీకి వెళ్ళి అచ్చట నుండి హరి ద్వార్ వెళ్ళి అచ్చట నుండి "భీంపూలు" చేరుకోవచ్చును. అలహాబాద్‌లో (ప్రస్తుతం ప్రయాగ్‌రాజ్‌గా) పేరు మారింది. అక్కడ త్రివేణీ సంగమం "గంగా, యమున" నదులతో పాటు అంతర్వాహినిగా "సరస్వతీ" నది కలదు. అక్కడ కూడా పుష్కర స్నానం చేసి తరించండి. అలహాబాద్ (ప్రయాగ్ రాజ్) చేరాలంటే రైలు, బస్సు, విమానమార్గములు ద్వారా చేరుకోవచ్చును. ప్రయాణ విషయములు అందరికీ తెలిసిన విషయమే.

**ప్రభవాది 60 సంవత్సరాల్లో 12 యుగాలలో 8వది అయిన "విష్ణుదేవతాక యుగం" దీనిలో నాల్గొవదైన "ప్రజాపతి దేవతాకమగు" 'అనువత్సర"నామ "విశ్వావసు"నామ సం॥రం ఈ సం॥రంలో ప్రతీ ఒక్కరూ ధాన్యము దానము చేసిన మంచిది. విద్యావంతులైన పండిత శ్రేష్ఠులకు ధాన్యం మీ శక్తి కొలది దానం చెయ్యండి. మకరసంక్రాంతి రోజున ఇస్తే ఇంకా అధిక ఫలము నిచ్చును.**




Scanned with OKEN Scanner

# ✦✦ నవనాయకుల ఫలములు ✦✦

**1.రాజు-సూర్యుడు :** రాజు సూర్యుడైనందున రాజు, మంత్రులతో అనేక అభిప్రాయాలు, వైరభావాలుకలుగును. ప్రజలకు శస్త్ర,చోర,అగ్ని,రోగ, బాధలు కలుగును. ఫోర్జరీ, నేరములు పెరిగినా పాలకులు, అధికారులు రక్షించుట జరు గును. అరాచకశక్తులు విజృంభించెదరు. దేశమంతటా గృహనిర్మాణ పథకం బాగుగా అమలు జరుగును. విదేశీమారక నిల్వలుబాగాపెరుగును. ఆర్థిక నేర లను నిరోధించుటకు తీవ్రచర్యలు తీసుకొనుట జరుగును. కార్ల ఉత్పత్తి పెరు గును. నూతనపరిశ్రమలు నెలకొల్పుదురు. పశువులు గొర్రెలు కోళ్ళ పెంపకం వృద్ధిలోనికివచ్చును. పాలఉత్పత్తి పెరుగును. డైయిరీ వ్యాపారం బాగుండును స్వయంకృత ఋణాలుఅధికంగాఇచ్చెదరు. చిన్నచిన్నపరిశ్రమలువృద్ధిఅగును ప్రతిపక్షంవారువిజృంభించెదరు. విద్యుత్‌సంబంధపరిశ్రమలుఅభివృద్ధినొందును.

**2.మంత్రి-చంద్రుడు :** మంత్రిచంద్రుడైనందున నిలకడలేనిగ్రహం అగుటచే మంచివర్షాలు కురియును. వస్త్రాలు, సుగంధద్రవ్యాలు, కాగితం, అలంకార సామాగ్రి, ఎక్కువగా ఎగుమతులు జరుగును. విశేషముగా పంటలు పండును దిగుబడులు బాగావచ్చుటచే రైతులుఆనందంతోఉంటారు. వృక్షజాతులు బాగా ఫలించును. పండ్లఉత్పత్తులుబాగాపెరిగిఇతరదేశాలకుఎగుమతులుపెరుగును. ప్రజాసంక్షేమ పథకాలుఎక్కువగా అమలుచేయుదురు. విద్యుత్‌నువివిధ పద్ధతు లలో ఉత్పత్తి చేయుటచే విద్యుత్‌కొరత అంతగా ఉండదు. అల్పసంఖ్యాక వర్గ ప్రజలుఉన్నతికి అనేకపథకాలు అమలుచేయుదురు. వరి,ధాన్యం, గోధుమలు, తృణధాన్యాలుబాగాపండును. బియ్యం విదేశములకు ఎగుమతులు జరుగును.

**3.సైన్యాధిపతి- సూర్యుడు :** సైన్యాధిపతి సూర్యుడగుటచేమనసైన్యంసమర్థ వంతంగాపనిచేయును. సైన్యం నియామక విషయాలలో నూతన చట్టములను తెచ్చెదరు. వాటిని ప్రతిపక్షంవారు తీవ్రంగా నిరసించినప్పటికీ పాలక పక్షం వారి నిర్ణయాలను అమలు చేసి నెగ్గించుకుంటారు. సైనికరంగం బలోపేత మునకు బడ్జెట్‌లో అధిక నిధులు కేటాయించెదరు. అంతరిక్ష పరిశోధనలకు నూతన పథకములకు నిధులు అధికంగా కేటాయించెదరు. భారతదేశఖ్యాతి మరింత పెరుగును. మనశాస్త్రజ్ఞులకృషి ఫలించును. సరిహద్దుదేశములతో యుద్ధవాతావరణం ఉన్నప్పటికీ ఎదురించి పోరాడుదురు. అనేక వ్యూహము లతో ముందుకు పోయి విజయం సాధించెదరు. కొత్త ఆయుధాలు చేరును.

**4.సస్యాధిపతి- గురుడు :** సస్యాధిపతి గురుడు అగుటవల్ల అన్నిరకముల పంటలు బాగాపండును. ఆహారధాన్యాల ఉత్పత్తి రికార్డుస్థాయిలో ఉండును. ఆహారధాన్యముల నిల్వలుపెరుగును. ఇతరదేశాలకు ధాన్యం రకాలు ఎగుమతి చేయుదురు. ఇసుక, గరువు, పచ్చనేలలయందు పంటలు బాగాపండును. శనగ, గోధుమ, మిర్చి, ధనియాలు, విశేషంగా పండుటచే ఎగుమతులు చేస్తారు. కాగితం, పంచదారలను కూడా ఎగుమతి చేసి విదేశీమారక ద్రవ్యం నిల్వలు పెరుగును. దేశములోని గుప్తధనమును వెలికితీయుటకు నూతనచట్టములను చేయుదురు. కొన్ని విషయములలో రాజ్యాంగ బద్ధంగా ఏర్పడిన సంక్షోభమును తగ్గించెదరు. చిన్నతరహా పరిశ్రమలువృద్ధి. బంగారం, వెండిధరలు హెచ్చుతగ్గులు.

**5.ధాన్యాధిపతి-కుజుడు :** ధాన్యాధిపతి కుజుడైనందున ముల్లుగల ధాన్యాలు ఎర్రనినేలలు, మెట్టపంటలు, వేరుశనగ, మిర్చి, కంద, పెండలం, దుంప రకాలు, జొన్నలు, కందులు పంటలు, బాగా ఫలించి దిగుబడులు పెరుగును. రాగి, కస్తూరి, పగడాలు, కుంకుమ, నూలు, పట్టు మరియు శిల్కు వీటికి మంచి





ధరలు వచ్చును. నిల్వదారులకు మంచి లాభాలు చేకూరును. ఆహారసంబంధ పరిశ్రమలు విరివిగా నెలకొల్పుదురు. ఎలక్ట్రానిక్స్ విద్యుత్ సంబంధపరిశ్ర మలు, కంప్యూటర్ రంగంలో అనేక నూతన ఆవిష్కరణలు మన దేశంలో జరు గును. ప్రఖ్యాతి నొందిన సెల్‌ఫోన్ కంపెనీలు భారతదేశంలో నెలకొల్పుదురు. దేశంలో అగ్నిప్రమాదాలు, వాహన ప్రమాదాలు రికార్డు స్థాయిలో జరుగును.

**6.అర్ఘాధిపతి- సూర్యుడు :** సూర్యుడు అర్ఘాధిపతైనందువల్ల ప్రతీవస్తువుకు ధరలు విపరీతంగా పెరుగును. నిల్వదారులకు విశేషలాభములు చేకూరును. సూర్యకిరణాలవలె సినిమా సూపర్ స్టార్‌లు వృద్ధిలో ఉంటారు. ప్రపంచస్థాయి పేరుప్రఖ్యాతలు పొందుదురు. సినీపరిశ్రమ గతేసం॥రంకంటే బాగుంటుంది. జర్నలిస్టులకు ఆదరాభిమానాలుపెరుగును. కొన్నిప్రత్యేక పథకములను ప్రవేశ పెట్టెదరు. పశుగణాభివృద్ధి,పాడిపరిశ్రమవృద్ధి,ఎలక్ట్రానిక్స్‌కంప్యూటర్, విద్యుత్ పరిశ్రమలతో పారిశ్రామిక వృద్ధిజరుగును. పారిశ్రామిక విధానములో అనేక మార్పులు, అనేకసంస్కరణలు చేసికొంతవరకు నిరుద్యోగసమస్యను తీర్చెదెరు.

**7.మేఘాధిపతి- సూర్యుడు :** మేఘాధిపతి సూర్యుడైనందున మేఘాలు ఖండ ఖండాలుగా వర్షించును. కొన్నిమండలాలందు అతివృష్టి, కొన్ని మండ లాలందు అనావృష్టిగా నుండును. సకాలంలో నైఋతీ ఋతుపవనాలు ప్రవేశించినా, వర్షాలు కురియుట ఆలస్యమగును. కందులు, వేరుశనగ, గోధు మలు, ఎర్రనిధాన్యాలు, బాగుగాఫలించును. ఎర్రసస్యాలువృద్ధి, దేశము లోనూ రాష్ట్రమునందు భయోత్పాతంకలిగి ప్రజానష్టములు కలిగించును. బంగాళాఖా తంలోనూ హిందూమహాసముద్రంనందుతుఫానులు అధికంగా ఉండును. తీర ప్రాంతంలో ఉన్నవార్కి నష్టములు. పంటలు పాడగును. దక్షిణ దిక్కులో మేఘ ములు పుట్టుట వల్ల దక్షిణ, పడమర రాష్ట్రములందు అధికవర్షాలు కురియును తుఫానుప్రమాదాలుకల్గును. కొన్నిసమయాల్లోమేఘాలువర్షించుటఆలస్యమగును.

**8.రసాధిపతి- శని :** రసాధిపతి శనైనందున దేశములో అరాచక శక్తులు విజృంభించెదరు. భయానక సంఘటనలు, అలజడులను సృష్టించెదరు. నల్లని భూములు, నల్లని ధాన్యాలు ఫలించును. నువ్వులు, నూనెగింజలు, అవిసెలు, మినుములు, ఉలవలు, నల్లపెసలు బాగాఫలించును. వీటి ధరలు పెరుగును. నిల్వదారులకు విశేషలాభాలుకల్గును. సరిహద్దు ప్రాంతాలందు యుద్ధభయం, ఆందోళకర సంఘటనలుజరుగును. ఇనుము, సిమెంట్, కంకర, ఇసుక, మట్టి ధరలువిపరీతంగాఉండును. సరుకుదొరుకుటకష్టమేఅగును. అనేకదౌర్జన్యాలు జరుగును. ఈశాన్యరాష్ట్రాలందు భయానక సంఘటనలవల్ల కర్ఫ్యూలు విధించె దరు. సైన్యం,పోలీసువ్యవస్థలురక్షణకల్పిస్తారు. నూనె,నెయ్యిలకుగిరాకీహెచ్చును.

**9.నీరసాధిపతి- బుధుడు :** నీరసాధిపతి బుధుడైనందు వల్ల పచ్చలధరలు పెరుగును. ఇప్పచెట్లు బాగా ఫలించును. ఇప్పపువ్వు ధర పెరుగును. పెసలు, వివిధ ధాన్యాలు బాగాదిగుబడివచ్చి మంచి ధరలు ఉండుటచే రైతులకు మంచి లాభాలు వచ్చును. నూతనంగా మెడికల్ కాలేజీలు అధికంగా నెలకొల్పుదురు. నూతన పరిశ్రమలు ఎక్కువగావచ్చును. రసవస్తువులుధరలుపెరుగును. చింత పండు, పంచదార, బెల్లం అధికంగా దిగుబడి వచ్చుటచే ఎగుమతులు చేయుదురు. బంగారం, వెండి, రాగి, పాదరసము ధరలు పెరుగును. వీటిని నిల్వ చేయువారికి మంచి లాభాలు వచ్చును. సం॥రం ప్రారంభంలో ఖరీదు చేసి కార్తీకంలో అమ్మాలి. వ్యాపారము బాగుండి రికార్డుస్థాయిలో జి.ఎస్.టి. వసూలు అగును. అనేక నూతన పరిశ్రమలు నెలకొల్పుదురు. ఆక్వారంగం, పౌల్ట్రీరంగం బాగా వృద్ధిని సాధించును. ద్రవ్యోల్బణం తగ్గుముఖం పట్టును.





Scanned with OKEN Scanner

# శ్రీ విశ్వావసు నామ సం॥రం 2025-2026లో భారతదేశ, ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రములందు జరుగు విశేషాంశములు

**ఏప్రియల్ 1 నుండి జూన్ 30 వరకు:** ఈ సమయాన చాతుర్గ్రహ కూటమి త్రిగ్రహ... గములు. మే16 నుండి జూన్4 వరకు కాలసర్పయోగము మరియు ఇతర గ్రహయోగ... వల్ల పరిపాలన సజావుగా నడవదు. పాలకులకు ప్రతీరోజు ఏదో ఒక సమస్య వేధించు... వేసవికాలం అగుటచే రికార్డుస్థాయిలోఉష్ణోగ్రతలుఉండును. రాజస్థాన్‌లోఅత్యధిక ఉష్ణో... నమోదగును. ఈ సమయంలో అధిక వాహనప్రమాదాలు జరుగును. అగ్నిప్రమాదా... అధికంగా జరిగి ప్రాణనష్టం ఆస్తినష్టం ఎక్కువగా ఉండును. ఒక రాష్ట్రములో ప్రభుత్వ... పడిపోవును. కేంద్రములోమంత్రివర్గ మార్పులు అనివార్యమగును. అధికార పక్షం వా... ప్రతిపక్షం వార్కి మాటల యుద్ధం పెరుగును. ప్రభుత్వనిర్ణయములు ఒక వర్గం వా... వ్యతిరేకంగా ఉండుటచే సమ్మెలు చేయుదురు. ఉగ్రవాద చర్యలు పెరుగును. సరిహద్దు ప్రాంతములందు చైనా, పాకిస్తాన్ వారు దురాక్రమణకు పాల్పడుదురు. మనసైన్య... చాలా చాకచక్యములతో యుద్ధవ్యూహాలతో త్రిప్పికొట్టి అంతర్జాతీయ వేదికలందు విజయ... సాధించెదరు. బంగారం, వెండి మొ॥లగు లోహముల ధరలు పెరుగును. ఈ సమయ... జరుగు ఉపఎన్నికలందు అధికారపార్టీవారు విజయం సాధించెదరు. మృగశిర కా... విశాఖ నక్షత్రంలో ప్రారంభమగుట వలన నైఋతి ఋతుపవనాలు సకాలంలో ప్రవేశి... చును. కాని వర్షాలు కురియుట కొంత ఆలస్యమగును. ముస్లిం దేశములందు బాంబు ప్రేలుళ్ళు జరిగి జననష్టం కలిగించును. పశ్చిమాసియాదేశాలందు యుద్ధవాతావరణ... ఉంటుంది. సినీపరిశ్రమబాగుంటుంది. ఒకసినిమా మంచిహిట్‌సాధించును.ఉత్తరాదిరాష్ట్ర... లందు కొండచరియలు విరిగిపడి రహదారులుమూతపడును. ప్రఖ్యాతవ్యక్తులకు అరిష్టము

**జులై 1 నుండి సెప్టెంబర్ 30 వరకు:** ఈ సమయంలో కుజ,శనులకు షష్టాష్టకము సమసప్తకము. కుంభరాశిలో సంపూర్ణచంద్రగ్రహణము మరియు ఇతర గ్రహస్థితుల వలన పరిస్థితులు అనుకూలించవు. అనేకమంది రాజకీయపార్టీలు మారుదురు. బంగాళాఖాతంలో అల్పపీడనములు అధికంగా ఉండును. తీరప్రాంతములకు అధిక వర్షము కురియును. తుఫాన్ ప్రమాదం వలన లక్షలాదిమంది నిరాశ్రయులగుదురు. ప్రభుత్వచర్యలుచాలా బాగుండును. ముంబాయి, హైదరాబాద్ వంటి నగరముల నీటమునుగును. 4 లేదా 5 రోజులు ప్రజా జీవనం స్తంభించును. అంతరిక్ష పరిశోధనలు ఆకస్మికంగావాయిదాపడును. తదుపరి విజయము సాధించును. షేర్ మార్కెట్ ఒడిదుడుకులకు లోనగును. అమెరికా, కెనడ, మెక్సికో, ఆస్ట్రేలియా దేశములందు పెద్దవైన ప్రకృతి ప్రమాదములు జరిగి చరిత్రలో నిలిచిపోవును ఉభయ తెలుగు రాష్ట్రములందు వాగులు, వంకలు, నదులు పొంగి ప్రవహించును కొన్ని నదులు ప్రమాదసూచికలు దాటి ప్రవహించును. 2 లేదా 3వ నెంబర్ ప్రమాద సూచిక వరకు వచ్చును. అధికారులు అప్రమత్తతో ఉండాలి. పశ్చిమాసియా దేశము లందు యుద్ధవాతావరణం ఉంటుంది. ఇతర దేశములలో కూడా వారి యందు పాల్గొనుటకు మొగ్గు చూపుదురు. ప్రపంచం అంతటా ఆర్థికమాంద్యం ఏర్పడును. భారతదేశమునకు ఫర్వాలేదు. పెట్రోలు, డీజిల్ ధరలు అమాంతం పెరుగును. ద్రవ్యోల్బణం పెరుగును. రూపాయి విలువ హెచ్చు తగ్గులకు గురిఅగును. రాజకీయ కురువృద్ధులకు అరిష్టము. విహార యాత్రలలో అపశ్రుతులు , ప్రమాదాలు అగ్ని ప్రమాదములు, రైలు లేదా విమాన, బస్సు ప్రమాదములు జరుగును.





**అక్టోబర్ 1 నుండి డిశంబర్ 31 వరకు:** ఈ సమయాన గురు, రాహువులకు షష్టాష్టకము, శని, కుజులకు షష్టాష్టకము, మరియు త్రిగ్రహయోగం వల్ల పరిస్థితులు అంతగా అనుకూలించవు. ఒక రాష్ట్రములో ముఖ్యమంత్రి మార్పు అనివార్యమగును. బంగాళా ఖాతంలో అల్పపీడనము ఏర్పడి తుఫానుగా మారును. ఒరిస్సా, పశ్చిమబెంగాల్ రాష్ట్రములకు అధిక నష్టమగును. మన రాష్ట్రమునకు అంతగా ఉండదు. ప్రపంచ దేశములలో యుద్ధవాతావరణం నెలకొని ఉంటుంది. మత ఘర్షణలు చెలరేగును. కొన్ని ప్రాంతాలలో కర్ఫ్యూను అమలు చేయుదురు. దేవాలయాలందు అపశ్రుతులు, కొన్ని పనులు వివాదస్పదమగును. ఈ సమయాన అగ్నిప్రమాదాలు, వాహన ప్రమాదములు అధికంగా జరుగును. కొండచరియలు విరిగిపడును. నిర్మాణాలలోఉన్న వంతెనలుగాని, భవనాలు గాని కూలిపోవును. దీపావళి సమయాన 2, లేదా 3రోజుల ముసురు ఉంటుంది. ఉత్తరాదిలో ఒక హిందీసినిమా మంచి విజయము సాధించును. సరిహద్దు దేశములతో చాలా జాగ్రత్తగా ఉండాలి. యుద్ధవాతావరణం ఉంటుంది. చొరబాటుదారులు అధికమగుదురు. సైన్యం కవ్వింపు చర్యలకు దిగుదురు. విద్యార్థులు, డాక్టర్లు సమ్మెలుచేయుదురు. సంక్షేమపథకాల అమలుకు పాలకులు కృషి చేయుదురు. కాని వ్యతిరేకతఅధికమగును. క్రీడారంగంలో మంచివిజయాలు లభించును. మంత్రివర్గ మార్పులు జరుగును. ఒకముఖ్య నాయకునిపై కోర్టు తీర్పులు వ్యతిరేకంగా వచ్చుటచే అలజడులు చెలరేగును. విహారయాత్రలలో అపశ్రుతులు సముద్ర తీర ప్రాంతాలందు ప్రమాదాలు జరుగును. కేరళ, తమిళనాడు ప్రాంతాలందు విస్తారంగా వర్షాలు కురియుటచే ప్రజాజీవనం స్తంభించును. పొగమంచు అధికంగా కురియుటచే ఉత్తరాదిరాష్ట్రాలందు రహదారులు మూతపడును.

**2026 జనవరి 1 నుండి మార్చి 20 వరకు:** ఈసమయాన ధనుస్సు,మకర, కుంభ రాశులందు చాతుర్గ్రహ కూటమి, శని, రాహువుల కలయికవల్ల ఉష్ణోగ్రతలు పడిపోవును. చలితీవ్రత పెరుగును.ఎవ్వరూ ఊహించని సంఘటనలు జరుగును. ఈశాన్య రాష్ట్రాలందు భయానక సంఘటనలు, తీవ్రవాద చర్యలు ఎక్కువగును. మతపరమైన వివాదములు చెలరేగును. ఉత్తరప్రదేశ, బీహార్, రాష్ట్రములందు కొన్ని వర్గములవారు సమ్మెలు చేయుదురు. పాలకులకు ప్రతిదినం ఏదో ఒకసమస్య వెంటాడును. ప్రతిపక్షం వారుతీవ్రమైన పదజాలంతోనిరసనలు వ్యక్తం చేయుదురు. సంక్రాంతిపండుగకు విడుదలయ్యే ఒక సినిమా సూపర్ హిట్ అగును. సంక్రాంతిసంబరాలు మహా అద్భుతంగా జరుగును. పుష్య అమావాస్య ప్రాంతములలో ఆకస్మికంగా కొన్ని ప్రాంతములందు వర్షం కురియును. షేర్ మార్కెట్ ఒడిదుడుకులుగా ఉన్ననూ ఉత్సాహంగానే ఉంటుంది. పెద్దకంపెనీలు, ఐ.టి. రంగషేర్లు బాగా పెరుగును. ఫిబ్రవరి 25 తేదీ నుండే పగటిపూట ఉష్ణోగ్రతలు పెరుగును.అంతరిక్షపరిశోధనలు విజయవంతమగును. క్రీడలతో మనదేశమునకు విజయాలు లభించును. బంగారం, వెండిధరలు ముందు బాగాపెరిగి, తదుపరి కొంతమేరతగ్గును. వ్యాపారాలు అంతగాసాగవు. పెద్దవైన కంపెనీలు, ఫ్యాక్టరీలు మూసి వేయుదురు. ఫిబ్రవరి 20 నుండి మార్చి 10 వరకు రాష్ట్రములో వివాహాది శుభకార్యములు ఎక్కువగా జరుగును. పశ్చిమాసియా దేశములందు యుద్ధవాతావరణం, అగ్రదేశముల నాయకులు సమావేశమగుదురు. తమిళనాడు, కర్ణాటక రాష్ట్రములలో భయానక సంఘటనలు జరుగును. తీవ్రవాద చర్యలు అధికంగా జరుగును.

**మొత్తంమీద పరిస్థితులు అంతఅనుకూలంగా ఉండవు. మే16నుండి జూన్4 వరకు "కాలసర్పయోగం"మీనరాశిలోశని,రాహువులు, కుంభంలోరాహువు, గురుడు ఈ సం॥రం అతిచారం వల్ల 3 రాశులు వృషభం, మిధునం, కర్కాటక రాశులందు సంచారంవల్ల విపరీతదేశారిష్టయోగాలువల్ల అనేక దుస్సంఘటనలుజరుగును. గాన దేవాలయములందు శాంతికొరకు నవగ్రహ యాగాలు, చండీయాగం ఇతర యాగాలు జరిపించవలెను. ఎవ్వరికి వారు కూడా శాంతి కార్యక్రమాలు చేసుకొనుట మంచిది.**

# 2025-2026 శ్రీ విశ్వావసునామ సంవత్సరంలో
# సరుకుల ధరలు

**1.చైత్రమాసం :** ఈ నెలలో 5 ఆదివారాలువచ్చుటచే ప్రారంభంలోధరలు పెరిగినా ఏ
ఏకాదశి నుండి స్వల్పంగాతగ్గును. రవాణాలు బాగాసాగును. మిర్చి, కుంకుళ్ళు, వేరుశ
వెండి, బంగారం, పాదరసం, సీసం, తిల,తైలం, వస్త్రాలు, పత్తి, కొబ్బరి, ఆహారపదార్థ
ధాన్యం, గోధుమలు, తృణధాన్యాలు, పువ్వులు, కూరగాయలకు మంచి ధరలు వచ్చు
సుగంధ ద్రవ్యాలు బాగాపెరుగును. పాల ఉత్పత్తుల ధరలు పెరుగును. పెట్రోఉత్పత్తు
పెరుగును. దేశమంతటా మంచి వ్యాపారం జరుగును. పూర్ణిమ నుండి ప్రతీ వస్తువుకు గిర
ఉండును. షేర్ మార్కెట్ 4వారాలు వృద్ధిలో నుండును. పెద్ద కంపెనీ షేర్లు వృద్ధి.

**2.వైశాఖమాసం :** ఈ నెలలో 5సోమవారాలు వచ్చుటచే మామిడి, బత్తాయి మొ॥
పండ్ల ధరలు బాగాపెరుగును. ఉల్లి, టమాటధరలు పెరుగును. ప్రతీ సరుకుకు ధరలుపె
గును. వ్యాపారం బాగాసాగును. నిల్వదారులకు విశేషలాభాలు. ఏవస్తువైనా ఈ నెల
అమ్ముట మంచిది. బంగారం, వెండిధరలుహెచ్చు తగ్గులకు లోనగును. కంది, వేరుశ
పెసలు, ధాన్యం, గోధుమలు, పంచదార, ప్రత్తి, మిర్చి, మినువులు, నువ్వులు, తవుడు, కో
గ్రుడ్లు, మాంసం ధరలుపెరుగును. షేర్‌మార్కెట్ ఒడిదుడుకులుగా ఉండును.1,2వారా
ఫర్వాలేదనిపించును.అపరాలు,మిర్చి,ధనియాలు,పసుపు,పశుగ్రాసం ధరలుబాగాపెరుగును

**3.జ్యేష్ఠమాసం :** ఈనెలలో 5బుధవారాలువచ్చుటచే, మార్కెట్‌లో అన్నిరకాలవస్తువుల
ధరలుబాగావచ్చును.వ్యాపారస్తులకులాభించును.ఏసరుకునిల్వచేసినమంచిధరలు వచ్చును
చింతపండు,మిర్చి,పెసలు,కందిపప్పు,మినపప్పు,ఆవాలు, ధనియాలు,జీలకర్ర,వాము, మెంతులు
జీడిపప్పు,లవంగాలుమొ॥లగు సుగంధద్రవ్యాలకు మంచిధరలు. మామిడి మొ॥లగు పండ్ల
ధరలు వచ్చును. బంగారం, వెండిధరలు ఒడిదుడుకులుగా నుండును. ప్రత్తి,ధాన్యం
గోధుమలు, తృణధాన్యాలు శుద్ధంలో కంటే బహుళంలో పెరుగును. పశుగ్రాసం ధరలు
హెచ్చును.షేర్ మార్కెట్ 4వారాలు పెరుగుదల మీదేఉండును. 4 వారాలు బాగాపెరుగును

**4. ఆషాఢమాసం :** ఈనెలలో 5గురువారాలు వచ్చుటచే ధరలుపడిపోవును. వెండి, బంగారం
ధరలునిలపాటు,పెట్రోఉత్పత్తులుపెరుగును.ధాన్యం,బియ్యం, పసుపు,నూనెరకాలు అపర
నుసులు, కాగితం, కలప, పశుగ్రాసం, కూరగాయల ధరలుపెరుగును. రవాణాలు అంతగా
సాగవు. పూల ధరలు తగ్గును. సుగంధద్రవ్యాలు, జీడిపప్పు, పత్తిధరలు శుక్లదశమినుండి
బాగాపెరుగును. మిర్చి, పొగాకు ధరలు పెరుగును. కోడిగ్రుడ్డుధరలు నిలపాటు, తవుడు
పాదరసం, పాలఉత్పత్తుల ధరలుపెరుగును. నిల్వదారులకు ఈనెలలో అమ్ముకొనుట
మంచిది. షేర్ మార్కెట్ 1, 2 వారములు ఒడిదుడుకులు 3, 4 వారములు బాగుండును.

**5.శ్రావణమాసం :** ఈ నెలలో 5శుక్రవారాలువచ్చుటచే బంగారం, వెండి, లోహజాతులు
శనగలు, పసుపు, కుంకుళ్ళు, నూనెరకాలు, ప్రత్తి, కొబ్బరి, అరటి పండ్లురకములు
పువ్వులు, ధాన్యం,గోధుమలు, బెల్లం, పంచదార, వస్త్రాలు, కాగితము, కలప,పశుగ్రాసం
జీడిగింజలు, తవుడు, సుగంధ ద్రవ్యములు, వేరుశనగ, వాము, ధనియాలు, శుక్లపంచమి
నుండి స్వల్పంగా ధరలు పెరుగును. పాల ధరపెరుగును. పెట్రోఉత్పత్తుల ధరలు
పెరుగును. పౌర్ణమి నుండి పై వాటికి ఇంకనూ ధరలు పెరుగును. కూరగాయల ధరలు
పెరుగును. షేర్ మార్కెట్ 1,2 వారములు ఒడిదుడుకులు, 3,4 వారములు బాగుండును

**6. భాద్రపదమాసం :** ఈ నెలలో 5 ఆదివారములు వచ్చుటచే, శుద్ధంలో ప్రతీ వస్తువుకి
నిలబాటుధరలు. పౌర్ణమినుండి ఇంచుమించు అన్నివస్తువులకుధరలు పెరుగును. నిల్వ
దారులు శుక్ల పక్షం ప్రారంభంలోకాని అమావాస్య ముందుగా అమ్ముకొనుట మంచిది. ప్రతీ
వస్తువుకు గిరాకీగా నుండును.1, 2 వారాలు మందంగా నుండును. 3, 4 వారాలలో మాని
నెయ్యి, లోహజాతులు ఆహార పదార్థాలు, కూరగాయలు, ధాన్యం, వెండి, బంగారం, ప్రత్తి
తవుడు,జీడిగింజలు,కలపధరలు పెరుగును. అరటి, కొబ్బరిధరలుపెరుగును. షేర్ మార్కెట్
బాగుండును. పూజాసామగ్రి, ఉలవలు, వాము, ధనియాలు, అల్లం,శొంఠిధరలు పెరుగును





**7.ఆశ్వీయుజమాసం :** ఈ నెలలో 5సోమవారాలువచ్చుటచే బెల్లం,పంచదార మందం, తిరిగి 3,4వారాలలో పెరు
నూనె,వేరుశనగ,మొక్కజొన్న, నువ్వులు, ధరలుస్వల్పంగాతగ్గును. పసుపు, సుగంధద్రవ్యాలు,జీడిగింజలు,
గును. వెండి,బంగారం, లోహజాతులు,కుంకుళ్ళు, తవుడు, ధాన్యం, గోధుమలు, తృణధాన్యాలు,
అపరదినుసులు, పూలు, కూరగాయలు, పానీయాలు ధరలుపెరుగును. దేశంలో ప్రకృతి వైరీత్యములు వల్ల
పాల ఉత్పత్తులు, మత్తు పానీయాలు ధరలుపెరుగును. దేశంలో ప్రకృతి వైరీత్యములు వల్ల
రవాణాలు సాగవు. క్రిమి, కీటకాదులు వల్ల బాధలు కల్గును. షేర్ మార్కెట్ నాల్గు వారాలు
పెరుగుదలమీదేఉండును.బ్యాంకింగ్,పెట్రోలియం,రియల్టర్స్,స్టీలుకంపెనీలషేర్లుపెరుగును.

**8.కార్తీకమాసం :** ఈ నెలలో 5బుధవారాలు వచ్చుటచే బెల్లం,పంచదార,గోధుమలు,
పసుపు,పొగాకు,టీ,కాఫీపొడర్లు,పత్తి, ధనియాలు,వాములకు ధరలుకొద్దిగాతగ్గును.బంగారం,
వెండి, పాదరసం, రాగిధరలు పెరుగును. పౌర్ణమితర్వాతధాన్యం,నూనెరకాలు, మొక్కజొన్న,
కంద,పసుపు,పాలఉత్పత్తులు,ఉల్లి,వెల్లుల్లి,అల్లం,ఉప్పుధరలుపెరుగును.కందులు,మినువులు,
పెసలు, శనగల ధరలు 1,2,3 వారాలు నిలపాటు, ఆఖరి వారం పెరుగును. పూలు, కొబ్బరి
ధరలు పెరుగును. ధాన్యంధరస్వల్పంగాతగును. షేర్‌మార్కెట్ ఒక రెండు వారములు
స్వల్పంగా మందగించినా 3,4 వారాలు పెరుగును. చిన్న కంపెనీలు కూడా లాభపడుదురు.

**9.మార్గశిరమాసం:** ఈనెలలో5శుక్రవారాలువచ్చుటచే ఫలజాతులు,పూలు,అరటి,
కొబ్బరి, ఉల్లి,వెల్లుల్లి,అల్లం,కిరాణాసామానులు, కాస్మెటిక్స్, కాగితం, కలప, నిత్యం వినియో
గించేవస్తువులుపెసలు,మినుములు,పత్తి,పసుపు,జీడిగింజలు,శుద్ధంలోస్వల్పంగాతగ్గును.తిరిగి
పౌర్ణమి నుండి ధరలుపెరుగును. నూనెరకాలు, నువ్వులు, పసుపు, బంగారం, వెండి, పాద
రసం,రాగిధరలుబాగాపెరుగును. నిల్వదారులకు విశేషలాభం. అమావాస్యముందు ధాన్యం
ధర మందం. షేర్ మార్కెట్ నాలుగు వారాలు హుషారుగానే ఉండును. వ్యాపారాలు బాగా సాగి
వర్తకులకు లాభించును. పత్తిధర ప్రారంభంలో స్వల్పంగా తగ్గి, అమావాస్య ముందు పెరుగును.

**10. పుష్యమాసం :** ఈ నెలలో 5 శనివారాలు వచ్చుటచే అన్నివస్తువులకు 1, 2, 3 వారాలు
ధరలువచ్చును.గతంలోనిల్వచేసినవిఈనెలలోఅమ్ముటమంచిది.బంగారం,వెండి,పాదరసం,
రాగిధరలు నిలపాటు,పెట్రో ఉత్పత్తులధరలుపెరుగును. మిర్చి,వేరుశనగ,నూనెరకములు
మొక్కజొన్న,పత్తి,అపరదినుసులు, కాగితం,కలప,బెల్లం,పంచదార,తిలతైలములుప్రారం
భంలో పెరిగినా చివరకు స్వల్పంగా తగ్గును. పూలు,ఉల్లి,టమాటా,ఆకుకూరలు,దుంపరక
ములకుధరలువచ్చును. షేర్‌మార్కెట్ 1,2 వారాలు మందం. 3,4 వారములు బాగుండును.
వస్త్రములు,కందులు,పసుపు, కంద, దుంపరకములు ప్రారంభంలోతగ్గి, పూర్ణిమకు పెరుగును.

**11.మాఘమాసం :** ఈ నెలలో 5సోమవారాలువచ్చుటచే వెండి,బంగారం,రాగి,పాదరసం,
లోహజాతులు, కిరాణాసామానులు,వస్త్రములు,కాగితం,కలప,పశుగ్రాసం,కొబ్బరి,వేరుశనగ,
పసుపు,కుంకుళ్ళు,పంచదార, బెల్లం, నెయ్యి, నూనెరకములు, తృణధాన్యములు, ధాన్యం,
గోధుమలు, మినువులు, పెసలు, శనగలు, కందులు,బొబ్బర్లు, 2వ వారం నుండి పెరుగును.
నిల్వదారులు యోచించి మసలుకోవాలి. ఇసుక,ఇటుక,సిమ్మెంట్,కంకరధరలుపెరుగును.
అరటి,కొబ్బరిధరలుపెరుగును. పత్తి, కోడిగుడ్లు, కూరగాయలు, ధాన్యం, బియ్యం,
గోధుమలు, ప్రారంభంలో కొద్దిగా తగ్గినా బహుళ పంచమిలగాయతు పెరుగును.
షేర్‌మార్కెట్ ప్రారంభంలో ఒడిదుడుకులుగా ఉన్ననూ 3,4వారములుబాగా పుంజుకొనును.

**12.ఫాల్గుణమాసం :** ఈ నెలలో 5 బుధవారాలు వచ్చుటచే ధాన్యాదులకు ధర స్వల్పంగా
తగ్గును.పౌర్ణమితర్వాత పెరుగును. నువ్వులు, పసుపు, నూనెరకములు, కొబ్బరి, సుగంధ
ద్రవ్యములు, జీడిగింజలు, ధనియాలు,చెరకు, పంచదార, బెల్లం 2వ వారం నుండి ధరలు
పెరుగును. బంగారం,వెండి,రాగి,పత్తి,కూరగాయలు,పూలరకములు,దుంపజాతుల ధరలు
పెరుగును. ఉల్లి,వెల్లుల్లి,టమాటాలకుధరలువచ్చును.వ్యాపారులకుమంచిఫలితాలువచ్చును.
వివాహాది శుభకార్యములు రికార్డు స్థాయిలో జరుగును. అన్నిరకముల వ్యాపారములు బాగా
సాగును. పత్తి, అపరదినుసులు, కిరాణా వస్తువులు, బాగా పెరుగును. ప్రభుత్వమునకు జి.ఎస్.టి.
రికార్డు స్థాయిలో వసూలు అగును. షేర్‌మార్కెట్ ఒడిదుడుకులుగా ఉన్ననూ, పెద్దకంపెనీ షేర్లు,
రియల్టర్స్ షేర్స్ బ్యాంకింగ్‌షేర్లు, పెట్రోలియంప్రొడక్ట్స్, నిర్మాణరంగం షేర్లు బాగా పెరుగును.





Scanned with OKEN Scanner

# మకరసంక్రాంతి పురుష పుణ్యకాలం

**సంక్రాంతి పురుషుడు** | **"మంద" నామధేయం** | **"వరాహ" వాహనం**

శ్రీ విశ్వావసునామ సంవత్సర పుష్య బహుళ ఏకాదశి బుధవారం అనూరాధ నక్షత్రం, గండయోగం, కౌలవకరణం, సింహలగ్నశుభసమయాన ది. 14-1-2026 తేదీ రా. 8.43 ని॥లకు సూర్యుడు మకర రాశిలోప్రవేశించును. రాత్రిప్రవేశంగాన మరునాడు 15-1-2026 తేదీ గురువారం సంక్రాంతిపండుగ

**మకరసంక్రాంతి ఉదయం నుండి మధ్యాహ్నం 1.00 గంట వరకు పుణ్యకాలం**



ఈ సంక్రాంతి పురుషుడు మంద నామధేయం రాజుల కరిష్టము. కుంకుమ స్నానంచే రాజులకరిష్టం. విచిత్ర వస్త్రం ధరించుటచే శుభములు. కస్తూరి గంధంచే యుద్ధభయం. కమలపుష్పం ధరించుటచే యశోవృద్ధి. వెండిధారణచే రజితనాశనం. రాగిపాత్రలో భుజించుటచే తామ్రనాశనం. భక్ష్యములు తినుటచే దుర్భిక్షము. మామిడి పండు తినుటచే సుఖము. వరాహం (పంది) వాహనంచే మూషికములకు కీడు. కత్తి ఆయుధంచే యుద్ధభయం. పీతవర్ణ గొడుగుచే పీతవస్తు నాశనము. పద్మము ధరించుటచే రాజులకు శుభములు. ఉత్తర దిక్కువలన ఉత్తరాది రాష్ట్రములకు నష్టం. సిగ్గువల్లన సౌఖ్యం. యవలు,అక్షతలుచే నష్టం. కృష్ణపక్షం - సుభిక్షం. తిధి ఏకాదశి- జనానురాగము. బుధవారం వల్ల సుభిక్షం. అనూరాధ నక్షత్రం- సువృష్టి. సింహలగ్నం-పురుష చింత. 18వ ముహూర్తం- మహాసౌఖ్యం. ఈ సంక్రాంతి పురుషుడు 8 విశాలనేత్రాలు, 8 వ్రేలాడు కనుబొమ్మలు, 4 పొడవైన ముక్కులు, 8 భుజాలు, 4ముఖాలు, 8చెవులు కలిగి 100 యోజనాల ఎత్తు 12 యోజనాల వైశాల్యం కలిగియుండును. ఈసంక్రాంతి పుణ్యకాలం చాలాముఖ్యమైనది.

**శ్రీ విశ్వావసునామ సం॥రంలో ఇష్టి,అన్వాదానం చేయు తేదీలు (అహితాగ్నులకు ప్రత్యేకం)**

| మార్చి | జూలై | అక్టోబర్ | జనవరి - 2026 |
|---|---|---|---|
| 30 ఇష్టి(యాగకాలః) | 10 అన్వాదానం | 6 అన్వాదానం | 3 అన్వాదానం |
| **ఏప్రియల్** | 11 ఇష్టి(యాగకాలః) | 7 ఇష్టి(యాగకాలః) | 4 ఇష్టి(యాగకాలః) |
| 12 అన్వాదానం | 24 అన్వాదానం పిండపితృయజ్ఞః | 21 అన్వాదానం పిండపితృయజ్ఞః | 18 అన్వాదానం పిండపితృయజ్ఞః |
| 27 అన్వాదానం పిండపితృయజ్ఞః | 25 ఇష్టి(యాగకాలః) | 22 ఇష్టి(యాగకాలః) | 19 ఇష్టి(యాగకాలః) |
| 28 ఇష్టి(యాగకాలః) | **ఆగస్టు** | **నవంబర్** | **ఫిబ్రవరి** |
| **మే** | 8 అన్వాదానం | 5 అన్వాదానం | 1 అన్వాదానం |
| 12 అన్వాదానం | 9 ఇష్టి(యాగకాలః) | 6 ఇష్టి(యాగకాలః) | 2 ఇష్టి(యాగకాలః) |
| 13 ఇష్టి(యాగకాలః) | 22 అన్వాదానం | 19 అన్వాదానం | 17 అన్వాదానం పిండపితృయజ్ఞః |
| 26 అన్వాదానం | 23 ఇష్టి(యాగకాలః) పిండపితృయజ్ఞః | 20 పిండపితృయజ్ఞః ఇష్టి(యాగకాలః) | 18 ఇష్టి(యాగకాలః) |
| 27 ఇష్టి(యాగకాలః) | **సెప్టెంబర్** | **డిశంబర్** | **మార్చి** |
| **జూన్** | 7 అన్వాదానం | 4 అన్వాదానం | 3 అన్వాదానం |
| 10 అన్వాదానం | 8 ఇష్టి(యాగకాలః) | 5 ఇష్టి(యాగకాలః) | 4 ఇష్టి(యాగకాలః) |
| 11 యాగకాలః (ఇష్టి) | 21 అన్వాదానం పిండపితృయజ్ఞః | 19 అన్వాదానం పిండపితృయజ్ఞః | 18 అన్వాదానం |
| 25 అన్వాదానం పిండపితృయజ్ఞః | 22 ఇష్టి(యాగకాలః) | 20 ఇష్టి(యాగకాలః) | 19 పిండపితృయజ్ఞః ఇష్టి(యాగకాలః) |
| 26 ఇష్టి(యాగకాలః) | | | |





# 2025-2026 సంవత్సరంలో గ్రహణాలు

ఈ సంవత్సరం భూమండలం (ప్రపంచములో) 4 గ్రహణాలు ఏర్పడుచున్నవి. అవి 2 సూర్యగ్రహణములు, 2 చంద్రగ్రహణములు. భారతదేశంలో 2 చంద్రగ్రహణములు మాత్రమే కన్పించును. 2 సూర్యగ్రహణములు భారతదేశములో ఎక్కడా కన్పించవు. ఈ మధ్య టి.వివంటి ప్రసారసాధనాలు వల్ల సోషల్ మీడియాలో ప్రపంచములో ఏ మూల గ్రహణం ఏర్పడినా ప్రసారం చేస్తున్నారు. అందువల్ల నేను కూడా తెలియచేస్తున్నాను. గ్రహణం మనకు కన్పిస్తేనే గ్రహణ నియమాలు పాటించవలెను. ఈ సంవత్సరం రెండు చంద్రగ్రహణాలకు మాత్రమే నియమాలు పాటించవలెను.

**1. సంపూర్ణ చంద్రగ్రహణం :** ది.7-9-2025తేది భాద్రపదశుక్లపూర్ణిమ ఆదివారం రాహుగ్రస్త సంపూర్ణచంద్రగ్రహణం. ఈగ్రహణం భారతదేశమంతటా కన్పించును.

| | |
|---|---|
| స్పర్శకాలము | రాత్రి గం॥ 9.56 ని॥ IST |
| నిమీలనకాలము | రాత్రి గం॥ 10.59 ని॥ IST |
| మధ్యకాలము | రాత్రి గం॥ 11.41 ని॥ IST |
| ఉన్మీలనకాలము | రాత్రి గం॥ 12.22 ని॥ IST |
| మోక్షకాలము | రాత్రి గం॥ 1.26 ని॥ IST |
| గ్రహణపుణ్యకాలము | 3 గంటల 30 నిముషములు |
| బింబదర్శనకాలము | 1 గంట 23 నిముషములు |




ఉత్తరగోళం, అపసవ్యగ్రహణం, రాహుగ్రస్తం,పింగళవర్ణం, తూర్పుఈశాన్యంలో స్పర్శయు, తూర్పు ఆగ్నేయములో నిమీలనము, దక్షిణ నైఋతిలో ఉన్మీలనము. పశ్చిమ నైఋతి పశ్చిమాసన్నమున ముగింపు కలుగును. ఈ గ్రహణం శతభిష నక్షత్రం, పూర్వాభాద్ర నక్షత్రములందు సంభవించుట వలన శతభిషం, పూర్వాభాద్ర నక్షత్ర జాతకులు, కుంభరాశివారు ఈగ్రహణం చూడరాదు.

**నిత్యభోజన ప్రత్యాబ్దిక నిర్ణయము:-** పూర్ణిమకు సంబంధించిన ఆబ్దికం (7-9- 2025) మధ్యాహ్నం 1.30 ని॥లోపుగా నిర్వర్తించవలెను. ఈరోజు రాత్రి భోజనం చేయరాదు.

**గర్భిణీస్త్రీలు :-** యధావిధిగా ప్రశాంతంగా నిద్రపోవలెను.

**దేవాలయములు :-** ఏ ఆగమశాస్త్ర గ్రంథములందు దేవాలయములు మూసివేయాలని చెప్పబడలేదు. కాని ఆచారంగా సాంప్రదాయంగా వస్తున్నందున మూసి వేస్తున్నారు. గాన నివేదన అనంతరం మూసివేసి మరునాడు ఉదయం యధావిధిగా దేవాలయములు తెరువవలెను.

**స్పర్శ, మోక్ష కాలమును బట్టి 12 రాశుల వారికి గ్రహణ ఫలములు**

| | | |
|---|---|---|
| 1.మేషం - ధనలాభం | 5.సింహం - స్త్రీ కష్టం | 9.ధనుస్సు - లాభం |
| 2.వృషభం - వ్యధ | 6.కన్య - అతికష్టం | 10.మకరం - వ్యయం |
| 3.మిధునం - చింత | 7.తుల - మాననాశనం | 11.కుంభం - ఘాతం |
| 4.కర్కాటకం - సౌఖ్యం | 8.వృశ్చికం - సుఖం | 12.మీనం - హాని |

**2.ఖండగ్రాస సూర్య గ్రహణం :** ది.21-9-2025 తేదీ ఆదివారం భాద్రపద బహుళ అమావాస్య **"చూడామణినామక"** ఖండగ్రాస సూర్యగ్రహణం. రాహుగ్రస్తం, ఈ గ్రహణం పసిఫిక్ మహాసముద్రం, న్యూజిలాండ్, అంటార్కిటికా, అట్లాంటిక్ మహాసముద్రం, ఆస్ట్రేలియా, ఫిజిదేశాలలో కన్పించును.

**భారతదేశములో ఎక్కడా ఈ గ్రహణం కన్పించదు.** గాన ఏవిధమైన నియమాలు పాటించనవసరం లేదు. ప్రసారమాధ్యమాలలో వచ్చిన వాటిని నమ్మకండి.

**3.కంకణాకార సూర్య గ్రహణం :-** ది.17-2-2026 తేదీ మంగళవారం మాఘ బహుళ అమావాస్య రాహుగ్రస్త కంకణాకార సూర్యగ్రహణము.

ఈగ్రహణం దక్షిణ అమెరికా, దక్షిణ అర్జెంటీనా, చిలీ, దక్షిణ ఆఫ్రికా, అంటార్కిటికా, హిందూ మహాసముద్రములలో కనిపించును. మన భారతదేశములో ఎక్కడా ఏప్రాంతంనందు కూడా కన్పించదు. గాన ఏవిధమైన నియమాలు పాటించనవసరంలేదు. ప్రసారమధ్యమాలలో వచ్చిన వాటిని నమ్మకండి. గ్రహణం కన్పించే ప్రాంతాలలో ఉన్న తెలుగు వారందరూ గ్రహణమునకు ఒక వారం ముందుగా మాకు ఫోన్‌చేసిన యెడల మీ ప్రాంతంలో గ్రహణ సమయాలు తెలియచేసెదము. ఈ నెంబరుకు ఫోన్ చేయండి. 9000 572 660

**4.గ్రస్తోదయ సంపూర్ణ చంద్ర గ్రహణం :** ది.3-3-2026 తేదీ మంగళవారం ఫాల్గుణ శుక్లపూర్ణిమ కేతుగ్రస్త గ్రస్తోదయ సంపూర్ణచంద్ర గ్రహణం. మన దేశములో ఖండగ్రాస గ్రహణము.

| | |
|---|---|
| గ్రహణ స్పర్శకాలము | మధ్యాహ్నం గం॥ 3.19 ని॥ IST |
| నిమీలనకాలము | సాయంత్రం గం॥ 4.33 ని॥ IST |
| మధ్యకాలము | సాయంత్రం గం॥ 5.03 ని॥ IST |
| సూర్యాస్తమయం (రాజమండ్రికి) | సాయంత్రం గం॥ 6.02 ని॥ IST |
| చంద్రోదయం (రాజమండ్రికి) | సాయంత్రం గం॥ 6.04 ని॥ IST |
| ఉన్మీలన కాలము | సాయంత్రం గం॥ 5.32 ని॥ IST |
| మోక్షకాలం | రాత్రి గం॥ 6.46 ని॥ IST |
| బింబదర్శనకాలము | 59 నిముషములు |



చంద్రోదయాది గ్రహణపుణ్యకాలము, 42 నిమిషములు మాత్రమే. సంపూర్ణ చంద్రగ్రహణం అయినప్పటికీ విడుపు సమయంలో 42 నిమిషములు మాత్రమే బింబము కన్పించును. గాన 6.02 నిమిషములకు పట్టు స్నానము. 6.46 నిమిషములకు విడుపు స్నానము చేయవలెను. గ్రహణ ప్రారంభం మధ్యాహ్నం గం॥ 3.19 ని॥ నుండి స్నానము చేయనవసరం లేదు గ్రహించగలరు.

ఈ గ్రహణం పుబ్బనక్షత్రం, సింహరాశియందు సంభవించును. గాన పుబ్బ నక్షత్రం, సింహరాశివారు ఈ గ్రహణమును చూడరాదు. ఉత్తర గోళం, అపసవ్య గ్రహణం, కేతుగ్రస్తం, నీలపింగళవర్ణం, మిశ్రమవర్ణంకలిగిఉండును. ఈ గ్రహణం తూర్పు దిక్కున ప్రారంభించి (స్పర్శ), తూర్పు ఆగ్నేయంలో నిమీలనము దక్షిణనైఋతులలో ఉన్మీలనము. పశ్చిమ దగ్గర మోక్షం కల్గును. మనకు స్పర్శ, నిమీలనం, ఉన్మీలనములు కన్పించవు.

**నిత్యభోజన ప్రత్యాబ్దిక నిర్ణయము:-** శుద్ధమోక్షం అయిన తర్వాత రాత్రి 6.46 ని॥ల తర్వాత స్నానం చేసి వండుకుని భుజింపవలెను. పగలు భోజనం చేయరాదు. మాసికం, ఆబ్దికం కూడా శుద్ధమోక్షం తదుపరి వండుకుని ఆచరింపవలెను.

**గర్భిణీస్త్రీలు :-** సాయంత్రం 5 గంటలనుండి రాత్రి 6.46 ని॥ల వరకు ప్రశాంతముగా నిదురించుట మంచిది.

**దేవాలయములు :-** ఉదయం నుండి మూసివేసి మోక్షకాలం తర్వాత తెరిచి సంప్రోక్షణ కార్యాలు చేసుకోవచ్చును. మీమీ సంప్రదాయములను అనుసరించి ఆచరించండి. ఆగమశాస్త్రాలందు మూసివేయమనిచెప్పలేదు. సంప్రదాయకంగా ఆచరిస్తున్నారు.





## 12 రాశుల వారికి గ్రహణ ఫలములు

| | | |
|---|---|---|
| 1.మేషం - మాననాశనం | 5.సింహం - ఘాతం | 9.ధనుస్సు - చింత |
| 2.వృషభం - సుఖం | 6.కన్య - హాని | 10.మకరం - సౌఖ్యం |
| 3.మిథునం - లాభం | 7.తుల - ధనలాభం | 11.కుంభం - స్త్రీ కష్టం |
| 4.కర్కాటకం - వ్యయం | 8.వృశ్చికం - వ్యధ | 12.మీనం - అతికష్టం |

**గమనిక :-** ఈ గ్రహణం ఈశాన్యరాష్ట్రములందు సంపూర్ణ గ్రహణము అగును. పశ్చిమ ప్రాంతములందు కన్పించదు. బొంబాయిలో చంద్రోదయం సా.6.45 ని॥ అగుటచే మోక్షకాల సమయం కూడా అయినందున అక్కడ గ్రహణం కన్పించదు. గుజరాత్‌లో కొన్ని ప్రాంతములందు మోక్షసమయం చంద్రోదయం సమయం కంటే ముందుగా అగుచున్నందున చంద్ర గ్రహణం కన్పించదు.

ఈ క్రింది చూపిన పట్టణములయందు చంద్రోదయం ముందుగా అగుటచే సంపూర్ణ గ్రహణం పట్టిన చంద్రబింబము స్పష్టముగా కనిపించును. విడుపుకూడా కనిపించును.

| పట్టణము | చంద్రోదయం | బింబకన్పించు సమయం | పట్టణము | చంద్రోదయం | బింబకన్పించు సమయం |
|---|---|---|---|---|---|
| | గం॥ ని॥ | గం॥ ని॥ | | గం॥ ని॥ | గం॥ ని॥ |
| ఇంఫాల్ | సా.05.15 | 01.32 | గౌహతి | సా.05.24 | 01.23 |
| ఇటానగర్ | సా.05.15 | 01.32 | పోర్టుబ్లెయిర్ | సా.05.27 | 01.20 |
| కోహిమా | సా.05.13 | 01.34 | షిల్లాంగ్ | సా.05.23 | 01.24 |
| అగర్తలా | సా.05.27 | 01.20 | సిబాసాగర్ | సా.05.11 | 01.36 |
| అయిజోల్ | సా.05.20 | 01.27 | సిల్చర్ | సా.05.20 | 01.27 |
| డిబ్రూగర్ | సా.05.09 | 01.38 | తమెలోంగ్ | సా.05.15 | 01.32 |

లక్షద్వీపములోని కవరత్తి, గుజరాత్‌లోని ద్వారక, రాజ్‌కోట్ ప్రాంతములందు ఈ గ్రహణం కనిపించదు. కర్నాటక రాష్ట్రం మంగుళూరులో 8 ని॥లు, ముంబాయిలో 2 ని॥లు, అహ్మదాబాద్‌లో 3 ని॥లు, గాంధీనగర్(గుజరాత్)లో 3ని॥లు, గోవాలోని పనాజీలో 7 ని॥లు, కేంద్రపాలితప్రాంతమైన సిల్వస్సా 3 ని॥లు, శృంగేరీలో 11 ని॥లు, రాజస్థాన్‌లోని ఉదయపూర్‌లో 8 ని॥లు, గుజరాత్‌లోని వడోదరా (బరోడా) 5ని॥లు, కొల్హాపూర్‌లో 6 ని॥లు, నాసిక్‌లో 6 ని॥లు, కొజీకోడ్‌లో 10 ని॥లు, మౌంట్‌అబులో 3 ని॥లు, అజ్మీర్‌లో 12 ని॥లు కోచ్చిలో 11 ని॥లు, హుబ్లీలో 10 ని॥లు మాత్రమే కన్పించును. ఈ ప్రాంతము లందు దృశ్యాదృశ్య చంద్ర గ్రహణం అగుట వల్ల గ్రహణ నియమాలు పాటించనవసరం లేదు. తెలుగువారు ఉన్న ప్రతీచోటా మా పంచాంగం ఉంటుంది. గాన అక్కడ వారి గురించి ఈ వివరములు తెలియజేస్తున్నాను. కనిపించీ కనిపించని గ్రహణం అగుటచే ఆయా ప్రాంతములోఉన్న తెలుగు వారు గ్రహణ నియమాలు పాటించనవసరం లేదు. మేము చూపిన సమయములు ఒక నిమిషం లేదా రెండు నిమిషములు తేడాతో సరిపోవును.

| పట్టణము | చంద్రోదయం | బింబకన్పించు సమయం | పట్టణము | చంద్రోదయం | బింబకన్పించు సమయం |
|---|---|---|---|---|---|
| | గం॥ ని॥ | గం॥ ని॥ | | గం॥ ని॥ | గం॥ ని॥ |
| విజయవాడ | సా.06.10 | 00.36 | నల్గొండ | సా.06.19 | 00.27 |
| హైదరాబాద్ | సా.06.22 | 00.24 | నెల్లూరు | సా.06.18 | 00.28 |

| పట్టణము | చంద్రోదయం గం॥ ని॥ | పుణ్యకాల సమయం గం॥ ని॥ | పట్టణము | చంద్రోదయం గం॥ ని॥ | పుణ్యకాల సమయం గం॥ ని॥ |
|---|---|---|---|---|---|
| తిరుపతి | సా.06.20 | 00.26 | బెంగుళూర్ | సా.06.28 | 00.18 |
| శ్రీశైలం | సా.06.20 | 00.26 | బాగల్‌పూర్ | సా.05.44 | 01.02 |
| కడప | సా.06.22 | 00.24 | భోపాల్ | సా.06.24 | 00.22 |
| అనంతపురం | సా.06.27 | 00.19 | భువనేశ్వర్ | సా.05.51 | 00.55 |
| కర్నూల్ | సా.06.25 | 00.21 | కన్ననూర్ | సా.06.38 | 00.08 |
| గుంటూరు | సా.06.12 | 00.34 | చండీఘర్ | సా.06.19 | 00.27 |
| కాకినాడ | సా.06.07 | 00.39 | చెన్నై | సా.06.17 | 00.29 |
| విశాఖపట్నం | సా.06.01 | 00.45 | కూచ్‌బీహార్ | సా.05.33 | 01.13 |
| విజయనగరం | సా.06.04 | 00.42 | కటక్ | సా.05.50 | 00.56 |
| శ్రీకాకుళం | సా.05.59 | 00.47 | డార్జిలింగ్ | సా.05.37 | 01.09 |
| ఏలూరు | సా.06.09 | 00.37 | డెహరాడూన్ | సా.06.17 | 00.29 |
| భీమవరం | సా.06.06 | 00.40 | ఢిల్లీ | సా.06.22 | 00.24 |
| చిత్తూరు | సా.06.26 | 00.20 | గ్యాంగ్‌టక్ | సా.05.36 | 01.10 |
| చీరాల | సా.06.15 | 00.31 | గయ | సా.05.52 | 00.54 |
| ఒంగోలు | సా.06.17 | 00.29 | హరిద్వార్ | సా.06.17 | 00.29 |
| జైపూర్ | సా.06.29 | 00.17 | హజారీబాగ్ | సా.05.51 | 00.55 |
| నాగపూర్ | సా.06.18 | 00.28 | పాట్నా | సా.05.51 | 00.55 |
| జలంధర్ | సా.06.25 | 00.21 | పాండిచ్చేరి | సా.06.19 | 00.27 |
| జమ్ము | సా.06.29 | 00.17 | పూణే | సా.06.41 | 00.05 |
| కన్యాకుమారి | సా.06.31 | 00.15 | పూరీ | సా.05.51 | 00.55 |
| కవలూరు | సా.06.19 | 00.27 | రాయపూర్ | సా.06.07 | 00.39 |
| కలకత్తా | సా.05.39 | 01.07 | రాంచీ | సా.05.51 | 00.55 |
| కోరాపుట్ | సా.06.04 | 00.42 | సంబల్‌పూర్ | సా.05.58 | 00.48 |
| లక్నో | సా.06.07 | 00.39 | సిమ్లా | సా.06.21 | 00.25 |
| మధురై | సా.06.27 | 00.19 | సిలిగురి | సా.05.37 | 01.09 |
| మిద్నాపూర్ | సా.05.44 | 01.02 | శ్రీనగర్ | సా.06.28 | 00.18 |
| ముర్షిదాబాద్ | సా.05.38 | 01.08 | తంజావూర్ | సా.06.23 | 00.23 |
| ముజాఫర్‌పూర్ | సా.05.50 | 00.56 | తిరువనంతపురం | సా.06.33 | 00.13 |
| మైసూర్ | సా.06.32 | 00.14 | త్రిచూర్ | సా.06.34 | 00.12 |
| నౌగాంగ | సా.06.15 | 00.31 | ఉజ్జయినీ | సా.06.31 | 00.15 |
| అలహాబాద్ | సా.06.05 | 00.41 | వారణాశి | సా.06.00 | 00.46 |
| అమృతసర్ | సా.06.30 | 00.16 | | | |

**గమనిక :-** ప్రజలు ఆయా పట్టణములో చూపిన చంద్రోదయ సమయంలో పట్టు స్నానము, రాత్రి 6.46 ని॥ల తర్వాత విడుపు స్నానం చేయవలెను. 3 ని॥ల నుండి 13 ని॥ల వరకు బింబము కనిపించు ప్రాంతీయులు విడుపు స్నానం చేస్తే సరిపోతుంది. సామాన్య ప్రజలందరూ గ్రహణమోక్షంతర్వాత అనగా రాత్రి 6.46 ని॥ల తర్వాతవండుకుని భోజనములు లేదా ఫలహారములు తినవలెను. ఈ నియమం అందరికి తెలిసినదే.







ఈసం॥రం కళాకారులకు మంచియోగకాలం. ప్రత్యేక గుర్తింపు ఉంటుం
ప్రభుత్వ సంబంధ అవార్డులు, రివార్డులు లభించును. టి.వి, సినిమాలందు
వారికి నూతనఅవకాశాలు లభించి పరిశ్రమలో నిలద్రొక్కుకుంటారు. మీ ప్రతిభ
తగ్గ గుర్తింపు లభించును. గాయనీ, గాయకులకు, రచయితలకు దర్శకుల
నూతన అవకాశములు విరివిగా లాభించును. జీవన ఔన్నత్యం పొందగలర

ఈసం॥రం అన్నిరకాలవ్యాపారస్తులకు యోగదాయకమైన కాలం. హోల్సే
మరియు రిటైల్ వ్యాపారులకు లాభించును. నూతన వ్యాపారములు లాభించును
జాయింటు వ్యాపారస్తులకు అనుకూలమే. రియల్ ఎస్టేటు రంగంలో ఉన్నవార
గృహనిర్మాణరంగంలోవారికిలాభమే. స్థిరాస్తివృద్ధి, భూములు కొంటారు. సరుకు
నిల్వచేయువారికి విశేషలాభములు. షేర్‌మార్కెట్‌లో ఉన్నవారికి మంచి యోగ

ఈసం॥రం విద్యార్థులకు గురుబలంవల్ల జ్ఞాపకశక్తిపెరిగి మంచి మార్కుల
ఉత్తీర్ణు లగుదురు. ఉన్నత చదువులు, విదేశీ చదువులు లభించును. ఇంజనీరిం
మెడికల్, లా, బి.యిడి, ఆసెట్, మొదలగు ఎంట్రన్స్ పరీక్షలందు మం
ర్యాంకులు పొంది కోరుకున్న కాలేజీలలో సీట్లుపొందగలరు. క్రీడాకారుల
యోగమే, క్రీడలలో విజయం సాధించి పతకాలు, బహుమానాలు పొందగలర

వ్యవసాయదారులకు ఈసం॥రం చాలాలాభదాయకంగాఉంటుంది. పం
దిగుబడి ఎక్కువగా వచ్చును. ఆర్థికంగా స్థిరత్వం పొందుట, కౌలుదార్ల
మంచిలాభాలు. గతంలోచేసిన అప్పులు తీరును. ప్రభుత్వ సహాయం లభించును
గృహంలో శుభకార్యాలు. చేపలు, రొయ్యలు చెరువులు చేయువారికి విశేషలాభ
పంటదిగుబడి పెరుగుటచే ధరలుఅధికంగా ఉండుటచే విశేష లబ్ధిని పొందగలర

**స్త్రీలకు :-** ఈసం॥రం స్త్రీలకు విశేష యోగంగా చెప్పవచ్చును. కుటుంబం
అందరూ మీ మాటకు విలువనిస్తారు. మీ పేరుతో విలువైన ఆస్తులు ఏర్పడును
ఉద్యోగము చేయువారికి ప్రమోషన్స్‌తో కూడిన బదిలీలు. అధికార మన్ననల
కుటుంబసౌఖ్యం. గర్భిణీస్త్రీలకు పుత్రసంతానప్రాప్తి. సులువుగా పురుడు వచ్చు
వివాహంకాని స్త్రీలకు ఈసం॥రం ప్రథమార్థంలో తప్పక వివాహం జరుగును

మొత్తం మీద ఈ సం॥రం గ్రహములు అనుకూలించుటచే జీవనసౌఖ్యం
మీమాటకు ఎదురులేకుండా పోవుట, గతంలో ఎన్నడూలేని విధంగా మీ ఆధిక్య
ఉంటుంది. మిమ్మల్ని చూడగానే ఎదుటవారికి ప్రత్యేక ఆకర్షణగా కనిపిస్తారు

**చేయవలసిన శాంతులు :-** ఈ సం॥రం మీపై ఈర్ష్య, ద్వేషం, అసూయ ఉండును
మంగళ, శనివార నియమాలు పాటించిన మంచిది. మంగళవారం రోజున మీ గ్రామం
గల శివాలయంలో రుద్రాభిషేకం చేయించుకోండి. శ్రీశైలక్షేత్ర సందర్శన మంచిది. ఓం
నమశ్శివాయ మంత్రాన్ని రోజూ 108 సార్లు జపించండి. నవగ్రహ, నరఘోష యంత్రా
ధరించిన మంచిది. **రూ.1300/-లు అగును. సొమ్ము బుట్టే వీరభద్ర దైవజ్ఞ, తిలక్‌రోడ్
రాజమహేంద్రవరం - 533 103 అను అడ్రసుకు M.O. ద్వారా లేదా ఈ క్రింది ఫోన్ నెంబరు
90005 72660 Phonepe, Google pay, Paytm ద్వారా చెల్లించి, మీ వివరాలు లెట
ద్వారా తెలపండి. మీపేరు, గోత్రంతో యంత్రాలు పూజించి 25 రోజులలో పోస్ట్ ద్వారా పంపగలమ**

**ఏప్రియల్ :-** ఈనెలలో ప్రథమార్థం చాలాయోగదాయకంగా ఉండును. అన్ని
రంగాలవారికి లాభమే. చేయువృత్తివ్యాపారములు అనుకూలించును. ఆదాయం
బాగుంటుంది. ఆరోగ్యలాభం, ద్వితీయార్థంలో కొన్నిసమస్యలుతలెత్తును. మిత్రులతో
విభేదాలు. అధికధనవ్యయం. ఆరోగ్యభంగాలు. స్త్రీవిరోధాలు, శత్రువులవల్ల భయం

**మే :-** ఈనెలలో మిశ్రమఫలితాలు. ఆరోగ్యరీత్యాకొన్నిఇబ్బందులు, అకారణ విరో
ధాలు. మనఃస్థిమితం ఉండదు. ఆదాయం బాగుంటుంది. చేయువృత్తి వ్యాపారాల
కలిసివచ్చును. శత్రువులపై ఆధిక్యత, వాహనసౌఖ్యం, గృహంలోశుభకార్యలాభం
నూతనపరిచయాలు, మాసాంతంలో దూరప్రయాణాలు, అన్నింటా విజయం





**జూన్ :-** ఈనెలలో గ్రహముల ప్రభావం ప్రథమార్థంలో అధికంగా ఉంటుంది. శారీరక గాయాలు, వాహనప్రమాదాలు, కుటుంబ చిక్కులు, అధిక ధనవ్యయం, ద్వితీయార్థంలో అనుకూలత, వృత్తివ్యాపారాలందు ధనవ్యయం, శుభకార్యాలు జరుగుట, బంధుమిత్రాదులతో కలయిక గౌరవలాభము, సంతాన సౌఖ్యం.

**జూలై :-** గ్రహాలన్నీ అనుకూలసంచారంవల్ల అన్నిరంగాలవారికి అనుకూలమే. ఆదాయంబాగుంటుంది. ఆరోగ్యలాభం, సంతోషవార్తలు వినుట, ప్రయాణసౌఖ్యం, శత్రువులపై ఆధిక్యత, బంధుమిత్ర సమాగమం. నూతన వ్యక్తుల పరిచయం. సంఘంలో ఉన్నతస్థితి. పెద్దవారితో పరిచయాలు, కోర్టువ్యవహారాలందుజయం.

**ఆగష్టు :-** ఈనెలలో కూడా అందరికీ బాగుంటుంది. చేయువృత్తి వ్యాపారాలందు అనుకూలం. ఆరోగ్యంబాగుంటుంది. ఆర్థిక సమస్యలుండవు. ఏదోలాధనము చేతికందును. వాహనసౌఖ్యం, సంతానసుఖం, బంధుమిత్రులకలయిక, శత్రుజయం, నూతన పరిచయాలు, కీర్తి, యశోభూషణ లాభం, ఉద్యోగులకు మంచిసమయము.

**సెప్టెంబర్ :-** అన్నివిధములుగా బాగుంటుంది. అన్నిరంగాలవారికి లాభమే. ఆరోగ్యంబాగుండి ఆదాయంనకు లోటుండదు. కుటుంబంలో సంతోషవార్తలు. సమస్యలు తొలగిపోవును. కుటుంబసౌఖ్యం, స్త్రీ సౌఖ్యం, శత్రువులపై ఆధిక్యత, సంఘంలో మీకు ప్రత్యేకగుర్తింపు ప్రభుత్వ సంబంధకార్యాలు పూర్తి. చేయువృత్తి వ్యాపారములందు అభివృద్ధి, కొన్ని సమస్యలు మబ్బు వీడినట్లు విడిపోవును.

**అక్టోబర్ :-** ఈనెలలోకూడా గ్రహాలఅనుకూల సంచారంవల్ల అన్నిరంగాలవార్కి లాభించును. చేయుప్రయత్నములు ఫలించును. ప్రయాణసౌఖ్యం, కుటుంబవృద్ధి, దైవదర్శనం, పెద్దవారితో పరిచయాలు, గృహంలో సంతోషాలు, ఆరోగ్యంబాగుంటుంది. ధనము నిల్వచేయుదురు. స్త్రీ సౌఖ్యము, సంతానంద్వారా లాభములు.

**నవంబర్ :-** అన్నింటా మీదేపైచేయి. కుటుంబ వ్యవహారాలు అనుకూలించును. ఆర్థిక సమస్యలుండవు. మిత్రులతో కలయిక. మాతృవంశసూతకాలు. ఇతరులను పరామర్శించుట, శత్రుజయం, భార్యతోసరైనఅవగాహన, మీ శక్తి సామర్థ్యములు వలన కొన్ని కార్యములు పూర్తిఅగును. ఉన్నత అధికారులను కలుసుకుంటారు.

**డిశంబర్ :-** ఈనెలలో అనుకూలత తగ్గును. పనులు మధ్యలో నిలచిపోవుట ఆర్థికసమస్యలు శత్రువులు వల్ల ఇబ్బందులు నమ్మినవారే దగాచేయుట, ఆరోగ్య భంగాలు, ఔషధసేవ, ప్రయాణాలందు కష్టములు, శారీరకశ్రమఅధికం. అకాల భోజనాలు. బంధుమిత్రులతోమాటామాటాపట్టింపులు. సంతానంకుకూడా ఆరోగ్య భంగాలు, 8వ ఇంట కుజప్రభావంఅధికం. ఊహించని సంఘటనలు ఎదురగును.

**జనవరి :-** అన్ని రంగములవారికి చేయువృత్తి వ్యాపారములు లాభించును. ఆరోగ్యలాభం, ధనలాభములు, కుటుంబసౌఖ్యం, నూతనవస్తు, వస్త్ర లాభములు, శారీరక సౌఖ్యంతక్కువ. బంధుమిత్రాదులతో విరోధాలు, కార్యాలు సకాలంలో పూర్తిగాకఇబ్బందులు. పెద్దవారిని కలుసుకొనుట, సంతానసౌఖ్యం, భార్యతో సరైన అవగాహనఉండదు. 8వ ఇంట గ్రహసంచారం వల్ల ఇబ్బందులు కల్గించును.

**ఫిబ్రవరి :-** శారీరకశ్రమ అధికమైననూ ఆదాయం బాగుంటుంది. అకాలభోజనములు, నిమిషంతీరికలేకుండా ఉండును. ఆరోగ్యలాభములు. సంతాన సౌఖ్యం, పనులు త్వరితంగాపూర్తి. బంధుమిత్ర సమాగమములు. గృహలాభములు, ఇల్లు మారుట, స్థానమార్పులు తప్పవు. ఉద్యోగులకు అనుకూల సమయం.

**మార్చి** గ్రహములన్నీ అనుకూలించుటచే మీ మాటకు ఎదురులేదు. పట్టిందల్లా బంగారమా? అనునట్లుండును. నూతన వ్యవహారములు లాభించును. ఎంతటి కార్యాన్నైనా సాధించగలరు. ఆదాయంబాగుంటుంది. ఆరోగ్యలాభం, కుటుంబవృద్ధి, మిత్రులసహాయంలభించును, నూతనపరిచయాలులాభించును. అప్రయత్నధనలాభం.



# మిధునరాశి ఫలితములు

## GEMINI

**మృగశిర 3,4 పాదములు ఆరుద్ర 1,2,3,4 పాదములు పునర్వసు 1,2,3 పాదములు**

**ఆదాయం -14 వ్యయం - 2 | రాజపూజ్యం - 4 అవమానం - 3**

**ఈ రాశి వారికి ఈ సంవత్సరములోగ్రహములదోషకాలములు**

**రవి :** 15-5-2025 నుండి 16-7-2025 వరకు ద్వాదశం, జన్మం, 18-9-202 నుండి 17-10-2025 వరకు అర్ధాష్టమం, 15-1-2026 నుండి 12-2-202 వరకు అష్టమం. **కుజుడు :** 27-7-2025 నుండి 11-9-2025 వరకు అర్ధాష్టమ 16-1-2026 నుండి 22-2-2026 వరకు అష్టమం. **గురుడు :** ఈ సం॥ర అంతా జన్మం **శని :** ఈ సం॥రం శుభుడే **రాహువు, కేతువులు :** ఈ సం॥రం శుభ

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహప్రభావంచే యోగదాయకంగా ఉండు వీరికి మంచి ఆలోచనాశక్తి. శక్తికిమించిన పనులు చేయుట, ఇతరులకు మం సలహాలుఇచ్చుట, ఆలోచనాశక్తిచే ఎలాంటి సమస్యలైనా పరిష్కారం జరిగి లా చును. యుక్తిచాతుర్యంతో నష్ట ద్రవ్యలాభం పొందుదురు. సాంఘికంగా మం ఔన్నత్యంకలుగును. ఆరోగ్యం చక్కబడును. సంతానం, కుటుంబరీత్యా ఊహిం కొన్ని సమస్యలు ఏర్పడును. పుణ్యక్షేత్రములను దర్శించెదరు. గృహంలో సం॥ ప్రా॥లో వివాహాదిశుభకార్యములు జరుగును. ధనఒత్తిడి ఉన్ననూ తట్టుకో గల సంఘంలో గౌరవాదులు పెరుగును. స్త్రీమూలక సమస్యలువల్ల కొంత మనస్తా కలిగించును. పితృవర్గ వర్గీయులు వల్ల ఒత్తిడికలతలుఏర్పడును. ప్రయాణాలం ఒత్తిడి, నరముల నిస్త్రాణ, భార్యకు గర్భస్రావాది దోషములు, స్త్రీ, పురుష మధుమేహాది రోగాదులచే బాధపడుదురు. స్థిరాస్తులు అమ్మకం చేయలేక అప్పు చేయుదురు. మత్తుపానీయసేవలు, గుప్తంగా పాపపు పనులలో దిగుట ఇతరు మేలుకొరకు ప్రాకులాడుటజరుగును. ప్రతీ చిన్నవిషయానికి ఎక్కువగా ఆలోచిం బాధపడుట, చోరభయంఆంతరంగికముగా వ్యధచెందుట జరుగును. ఆప్తమిత్ర లతో కలహములు గృహ నిర్మాణములు కలిసి వచ్చును. నూతన గృహనిర్మాణ లేదా ఇండ్లస్థలంకొంటారు. మొత్తంమీద ఈరాశి స్త్రీపురుషాదులకు యోగకాలమే

ఈ సం॥రం ఉద్యోగులకు అన్నివిధాలుగా లాభించును. పనికి తగిన గుర్తిం లభించును. కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వంలో ఉన్నవారికి ప్రమోషన్స్‌తో కూడిన బదిలీల ప్రత్యేకమైన గుర్తింపు ప్రవేటు కంపెనీలందు పనిచేయువారికి యాజమాన్య యొక్క మన్ననలు పొంది లాభాలు పొందగలరు. ప్రత్యేకమైన హోదాతో మరో కంపెనీకి మారుదురు. నిరుద్యోగులకు ఈ సం॥రం ఖచ్చితంగా ఉద్యోగంలభి చును.జీవితంలోస్థిరత్వం.పర్మినెంటుకానివారికి ఈసం॥రం పర్మినెంటు అగును

రాజకీయరంగంలో ఉన్నవారికి ఈసం॥రం అనుకూలమే. ప్రజలలో మం గుర్తింపు లభించును. అధిష్టాన వర్గంవారితో మైత్రి, మిమ్మల్ని గుర్తించి పార్టీలో ఏదో ఒకపదవిఇస్తారు. మీరుచేయుపనులు వలన మీ పేరుప్రఖ్యాతులు పెరుగును ధనము కూడా మంచినీళ్ళవలె ఖర్చుచేయుదురు. ఏదోఒక నామినేటడ్ పదవి లభించును. ఎన్నికలలో పోటీచేసిన మంచి మెజారిటీతో విజయం సాధించెదరు





ఈసం॥రం కళాకారులకు గురుబలం అంతంతమాత్రమే. సప్తమ రాజ్యాధిపతి జన్మంలోఉండుటచే వీరికి అంత అనుకూలత ఉండదు. శ్రమకుతగ్గ ఫలితం ఉండదు. నూతనఅవకాశాలుచేజారిపోవును. మీకురావలసిన అవార్డులు చివరి నిమిషంలోఇతరులకుపోవును. టి.వి,సినిమాలలోఉన్నవారికి విజయాలు ఉండవు.

ఈసం॥రం అన్నిరకాలవ్యాపారస్తులకుయోగకాలమే.పట్టిందల్లాబంగారమా? అనునట్లుండును. హోల్‌సేల్,రిటైల్‌వ్యాపారులకులాభమే. మంచి వ్యాపారాలుజరిగి లాభాలుపొందగలరు. నూతనవ్యాపారాలకు శ్రీకారంచుట్టెదరు. జాయింటువ్యాపారస్తు లకుబాగుంటుంది. బిల్డింగ్‌నిర్మాణంలోఉన్నవార్కినూతనకాంట్రాక్టర్లకులాభదాయకం. సరుకులునిల్వచేయువారికిలాభాలుబాగుండును.బంగారం,వెండివ్యాపారులకుబాగుంటుంది

ఈసం॥రం విద్యాకారకుడుజన్మస్థానంలోసంచారంవల్లవిద్యార్థులకు జ్ఞాపక శక్తితగును. ఊహించినమార్కులురావుకానిఉత్తీర్ణులగుదురు. ఇంజనీరింగ్, మెడికల్, బి.యిడి,లాసెట్,ఆసెట్ మొ॥లగు ఎంట్రన్స్‌పరీక్షలందు మంచిర్యాంకులు పొంద లేక కోరుకున్నచోట్లసీట్లనుపొందలేరు. విదేశీచదువులు రాణించవు. క్రీడాకారులకు మాత్రం కొంతమేర బాగుండును. విజయాలుసాధించి అవకాశములు పెరుగును.

వ్యవసాయ దారులకు రెండుపంటలు ఫలించును. అధికదిగుబడి పొందుట వల్ల ఆర్థికంగాస్థిరపడుదురు. ఋణాలుతీరును. ప్రభుత్వసహాయంఅందును. కౌలు దార్లకు అనుకూలమే. వాణిజ్యపంటలు. పండ్లతోటలవారికి విపరీత లాభాలు. గృహనిర్మాణములు చేస్తారు. చేపలు, రొయ్యలు చెరువులు చేయువారికి కూడా విశేషంగా లాభించును. ఆనందంతో ఉంటారు. కోళ్ళఫారమ్స్ వార్కి అనుకూలం.

**స్త్రీలకు :-** ఈసం॥రం గ్రహబలం వలన మీ మాటకు ఎదురులేదు. కుటుంబంలో అందరూ మిమ్మల్ని గౌరవించెదరు. ఉద్యోగాదులు చేయువారికి అధికారుల మన్ననలు, ప్రమోషన్‌తో కూడిన బదిలీలు, విలువైన ఆభరణప్రాప్తి, స్థిరాస్తి మీ పేరుపై కొనుట. వివాహం కాని స్త్రీలకు ఈసంవత్సరం ఖచ్చితంగా వివాహం జరుగును. రాజకీయాలలో ఉన్నవారికి పదవులు లభించును. గర్భిణీ స్త్రీలకు సుఖ డెలివరీ, పుత్రసంతానప్రాప్తి. గతంలో భార్యాభర్తలు ఎడబాటుగా ఉన్నవారు ఈసం॥రం తప్పక కలుస్తారు. నిరుద్యోగ స్త్రీ, పురుషాదులకు ఉద్యోగం లభించును.

మొత్తంమీద ఈ రాశి స్త్రీ పురుషాదులకు శని, రాహువు, కేతువుల ప్రభావంచే అన్నివిధాలుగాయోగదాయకం.సుఖసంతోషాదులు,సంఘంలోమంచిస్థితి, స్థిరత్వం పొందుట, ఇత్యాదిశుభాలు అన్నియు పొందగలరు. మీ మాటకు ఎదురుండదు.

**చేయవలసిన శాంతులు :-** ఈరాశి వారికి నరఘోష, ఇతరులఈర్ష్య,అసూయ, ద్వేషం అధికంగా ఉండును. మంగళ,శనివారనియమాలుపాటించి మీకుఇష్టమైన రోజున మీగ్రామం లోగల శివాలయంలో రుద్రాభిషేకం, చేయించుకుని ఒక్కరోజైనా శ్రీశైలంలోజాగరణ చేయండి. నరఘోష,నవగ్రహశాంతియంత్రాలుధరించినమంచిది. రూ. 1300/-లు అగును. సొమ్ము బుట్టే వీరభద్ర దైవజ్ఞ, తిలక్‌రోడ్, రాజమహేంద్రవరం - 533 103 అను అడ్రసుకు M.O. ద్వారా లేదా ఈ క్రింది ఫోన్ నెంబరుకు 90005 72660 Phonepe, Google pay, Paytm ద్వారా చెల్లించి, మీ వివరాలు లెటరు ద్వారా తెలపండి. మీ పేరు, గోత్రంతో యంత్రాలు పూజించి 25 రోజులలో పోస్ట్ ద్వారా పంపగలము.

**ఏప్రియల్ :-** గ్రహాలు అనుకూల సంచారం వల్ల అన్నిరంగాల వారికి యోగమే. పట్టిందల్లాబంగారమా? అనునట్లుండును. ఏపనితలపెట్టిన పూర్తగును. వివాహాది శుభకార్యాలుజరుగును. అన్నింటా మీదే పైచేయి. శత్రువులు మీకు వశమగుదురు. భూసంబంధవ్యవహారాదులలోమధ్యవర్తిత్వంచేస్తారు.సంఘంలోఉన్నతస్థితి,సౌఖ్యం,

**మే :-** ఈనెలలో 12వఇంట గ్రహసంచారంకొంతమేరయోగించదు. ఆదాయం వచ్చినా మంచినీళ్ళవలే ఖర్చగును. వ్యాపారాలు బాగాసాగును. కుటుంబంలో దుబారా ఖర్చులు పెరుగును. ఆరోగ్యంబాగుంటుంది. నూతన పరిచయాలు లాభించును. అన్నిరంగాలవారికి ఆర్థికంగా ఇబ్బందులు తప్పవు. సంతానసౌఖ్యం.

వ్యాపారాదులు ఎంతబాగా

**జూన్:-** ఈనెలలో మిశ్రమఫలితాలుఉండును. వ్యాపారాదులు ఎంతబాగా ... ఆర్ధికలోటు,ఋణాలు చేయవలసివచ్చ... నన్నూ మనఃస్థిమితం ఉండదు. సంతానంవల్ల కూడా కొన్ని చిక్కులుత... నమ్మినవారివల్ల దగాపడుదురు. మానసిక ఆందోళనలు, ఊహించని సంఘట... ఆరోగ్యరీత్యా ఇబ్బందులు. ఈనెలప్రారంభం మొదటివారంలో చికాకులు కలిగిన 2వవారం ...

**జూలై:-** ఈనెలప్రారంభం మొదటివారంలో చికాకులు కలిగిన 2వవారం ... అన్నిరంగములవారికి లాభించును. ఆర్థికలావాదే... పరిస్థితులు చక్కబడును. వాహనసౌఖ్యం, బంధుమిత్రులరాక, దూరప్రయా... సంతృప్తి. ఆరోగ్యలాభం, నూతనపరిచయాలు వలన లాభమ... చేయుట, సంతోషకరవార్తలు వినుట, చేయువృత్తి వ్యాపారములందు రా...

**ఆగష్టు:-** అన్నిరంగాలవారికి లాభమే. చేయువృత్తి వ్యాపారములందు రా... ధనలాభం, ఆరోగ్యలాభం, శత్రువులపై ఆధిక్యత, వాహన సౌఖ్యం, భూ సం... వ్యవహారాలందు పాల్గొనుట, మిత్రులతో కలిసి విందులు వినోదాలు, శ... సౌఖ్యం, స్త్రీసౌఖ్యం, నూతన పరిచయాలు, సంఘంలో మీపేరు ప్రఖ్యాతులు...

**సెప్టెంబర్:-** చేయువృత్తి వ్యాపారములందు అనుకూలత. అన్నింటా విజ... ఆరోగ్యంబాగుండును. ఆర్థికలావాదేవీలు సంతృప్తి. పాతబాకీలు వసూల... ప్రభుత్వ సంబంధ వ్యవహారాలు, సంతానం కూడా స్థిరత్వం పొందుటచే ఆనం... నూతన పరిచయాలు లాభించును. భార్యాభర్తల మధ్య సరైన అవగాహన కల...

**అక్టోబర్:-** ఈనెలయందు అందరికీయోగదాయకంగా ఉంటుంది. ధనం ... చేయుదురు.స్థిరాస్థులనుకొంటారు.నూతనవాహనలాభం,పాతగృహంలోమా... చేయుదురు. గృహచలనం తప్పదు. వృత్తి, వ్యాపారాలు బాగుంటాయి. భార్యా... మధ్య సరైన అవగాహన ఉంటుంది. కుటుంబ సౌఖ్యం తీర్థయాత్ర ఫల...

**నవంబర్:-** ఈనెలలో మిశ్రమ ఫలితాలు ఉంటాయి. కొన్నింటిలో అపజ... తప్పదు. కొన్నిపనులునిలచిపోవును.ప్రభుత్వసంబంధవ్యవహారాదులందున... మిత్రులతో విభేదించుట, భార్యాభర్తల మధ్య తగాదాలు వచ్చి సమసిపో... సంతానమువలన కూడా చికాకులు కలిగించును. బంధుమిత్ర విరోధము...

**డిశంబర్:-** గ్రహముల అనుకూల సంచారమువలన అన్ని రంగములవా... లాభదాయకమే. చేయు వృత్తి వ్యాపారాలు రాణించును. ఆర్థికంగా బాగుంటు... ఆరోగ్యలాభం, ధైర్యంతోకూడినపనులుచేయుట, వాహనసౌఖ్యం, గృహలాభము... సంతాన సౌఖ్యం, శత్రువులపై ఆధిక్యత, వ్యసనాలుద్వారా ధనవ్యయం, స్త్రీసౌ...

**జనవరి:-** అన్నింటామీదేపైచేయి.ఆనందంగానూ, సంతోషంతో ఉంటారు. ... లావాదేవీలు బాగుండును. ఎంతోకాలంగా ఎదురు చూస్తున్న పనులు పూర్తగు... ఎంతటివారైనా మీసలహాతీసుకుంటారు. నూతనవస్తు, వస్త్రలాభం. పాతస్నేహి... లనుకలుసుకొనుట,ప్రయాణసౌఖ్యం,స్త్రీలతోసాంగత్యం,ప్రభుత్వకార్యములు ... ఉన్నతవ్యక్తుల పరిచయాలవల్ల లబ్ధి కల్గును. ప్రథమార్థంలో అంతా పై విధ... ఉండును. 20వ తేదీ నుండి పరిస్థితులు అనుకూలించును. జాగ్రత్తగా ఉండ...

**ఫిబ్రవరి:-** ఈనెలలో మిశ్రమఫలితాలుఉండును. పనులు పూర్తగును. ... మంచినీళ్ళవలెఖర్చుచేస్తారు. ఆరోగ్యం అంతంతమాత్రమే మనఃస్థిమితం ఉండ... కోపంపెరుగును. ప్రతి చిన్నవిషయానికి గాబరా పడుదురు. వ్యవహారాదుల... నష్టములు తప్పవు. సోదరవర్గంవారితోవిరోధాలు. కుటుంబ కలహాలు పెరుగు... ప్రయాణాలందు నష్టములు, వస్తువులు పోగొట్టుకుంటారు. శారీరక శ్రమ అధి...

**మార్చి:-** ఈ నెలలో అన్నిరంగాలవారికి చేయువృత్తివ్యాపారాలు రాణింపు ... హారాలుకలిసివచ్చును. ఆదాయంబాగుంటుంది. ఆరోగ్యలాభం, యశోభూ... ప్రాప్తి,స్పెక్యులేషన్‌లాభాలు, ప్రయాణాలుకలసివచ్చును. భార్యతోసఖ్యత. ఆనం... కుటుంబసౌఖ్యం, శత్రుజయం,కీర్తివృద్ధి, నూతన పరిచయలాభములు కలుగు... వివాహాది శుభకార్యములకు హాజరగుట, విద్యార్థులు పరీక్షలు బాగా వ్రాయుదు...



FORM - 6





# కర్కాటకరాశి ఫలితములు

## CANCER

పునర్వసు 4 వ పాదము పుష్యమి 1,2,3,4
పాం॥లు ఆశ్రేష 1,2,3,4 పాదములు

ఆదాయం - 8 వ్యయం - 2 | రాజపూజ్యం - 7 అవమానం - 3

**ఈ రాశి వారికి ఈ సంవత్సరములోగ్రహములదోషకాలములు**

**రవి :** 15-6-2025 నుండి 17-8-2025 వరకు ద్వాదశం, జన్మం 18-10-2025 నుండి 16-11-2025 వరకు అర్ధాష్టమం, 13-2-2026 నుండి 14-3-2026 వరకు అష్టమం. **కుజుడు:** 4-6-2025 వరకు జన్మం, 13-9-2025 నుండి 25-10-2025 వరకు అర్ధాష్టమం. 23-2-2026 నుండి ఆఖరుకు అష్టమం. **గురుడు :** ఈ సం॥ అంతా ద్వాదశం, జన్మం **శని :** 10-10-2025 నుండి **రాహువు :** ఈ సం॥రం అంతా అష్టమం **కేతువు :** ఈ సం॥రం శుభుడే 10-1-2026 వరకు అష్టమం

ఈ రాశి స్త్రీ పురుషాదులకు మహోన్నతకాలంగా చెప్పవచ్చును. గత సం॥రం కంటేఈసం॥రం మంచిచలాయింపుకాలంగానడచును. ఋణవిముక్తి, ఏకార్యాలు తలపెట్టినా అవలీలగాచేయుట, హోదాకలిగిన వ్యక్తులపరిచయం. ధన, కుటుంబ, విద్యా, వినోద, నటీనటన చాతుర్యం కలుగును. గత కొద్దికాలంగా పడుచున్న బాధలు పటాపంచలై పోవును. గృహంలో వివాహాది శుభకార్యాలు, గృహజీవితా నందం, ప్రాణమిత్ర వైషమ్యములు అంతరించుట కలుగును. నూతనకార్యములు కలసివచ్చును. అప్రయత్న ధనలాభాలు. ఎంతోకాలంగా పెండింగ్‌లో ఉన్నపనులు పూర్తి. కోర్టువ్యవహారాలందు మీకు అనుకూలంగా తీర్పులువచ్చును. భూ, గృహాదు లలో వచ్చిన పేచీలు పరిష్కారమై ఆర్థికబాధలు అంతరించును. భూ, గృహాదులు కొనుట, లేదా బాగుచేయించుట, సంతానంఅభివృద్ధి, శని సప్తమాధిపతి అయి 9వ కోణస్థితివల్ల నూతన వృత్తులు వ్యవసాయ, వ్యాపారాలలో అభివృద్ధి, గుప్త స్త్రీసమావేశాలు, వినోదవిహారాదులుకలుగును. పుణ్యక్షేత్రసందర్శనలు మనః శ్శాంతి కలుగును. రక్తబంధు వర్గంలో రుగ్మతలు కలిగి శాంతించును. జీవితంలో ఎరుగనిఉత్కృష్టత సిద్ధించును.పితృవర్గీయుల ఆదరణ, అభిమానం పొందుదురు. సంఘసేవ చేస్తారు. పదిమంది పొగడ్తలచే మీ మాటవిలువపెచ్చును. బంధువర్గం లో వారిని మించిన ఆలోచనా పటిమచే ఎలాంటి క్లిష్ట సమస్యనైనా సాధించి ఘనత పొందగలరు. సంతానముయొక్క అభివృద్ధి, ప్రాముఖ్యత సిద్ధించును.

ఈ సం॥రం ఉద్యోగులకు మహోన్నతకాలంగా ఉండును. అధికారులమన్న నలు పొంది ప్రమోషన్స్‌తో కూడినబదిలీలు, గృహలాభాలు, కేంద్రరాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు ఇంక్రిమెంట్లుపెరుగును.ప్రవేటుకంపెనీలందు పనిచేయువారికి వారి ప్రతిభను గుర్తించి ప్రమోషన్స్ కల్పింతురు. పెద్ద కంపెనీలు మిమ్మల్ని ఏరికోరి తెచ్చుకుంటారు. నిరుద్యోగులకు జూలైతర్వాత ఉద్యోగాలుపొందిస్థిరత్వం పొంద గలరు. పర్మినెంటు కానివారికి ఈసం॥రం తప్పనిసరిగా పర్మినెంటు అగును.

రాజకీయ నాయకులకు కూడా మంచి యోగమే. గ్రహముల అనుకూల సంచారంవలన ఏదోఒక పదవి తప్పక పొందగలరు. అధిష్ఠానవర్గంవారి మన్ననలు పొందుదురు. ప్రజలలో కూడా మంచివాడిగా గుర్తింపు లభించును. ఎన్నికలలో పోటీచేసినట్లయిన తప్పక విజయం సాధించగలరు. నామినేటడ్ పదవైనా లభించును. ధనం ఖర్చు అయినా చక్కని ఫలితములు పొందగలరు.




Scanned with OKEN Scanner

ఈ సంవత్సరంకళారంగంలోఉన్నవారికియోగమే. టి.వి, సినిమా పరిశ్రమలో ఉన్నవారికి మంచి గుర్తింపు చక్కని విజయాలు లభించుట వల్ల నూతన అవకాశాలువచ్చును. ప్రభుత్వ, ప్రవేటు సంబంధ అవార్డులు, రివార్డులు పొందగలరు. గాయనీ గాయకులు, డ్యాన్సు మాష్టర్లకు, దర్శకులకు, కొత్తవారికి ఛాన్సులు లభించి జీవితంలో స్థిరత్వం పొందగలరు. మీ ప్రతిభకు తగిన గుర్తింపు వస్తుంది.

వ్యాపారస్థులకు కూడా అనుకూలమే. ఆశించిన దానికంటే అధికలాభములు పొందగలరు. హోల్‌సేల్ అండ్ రిటైల్ వ్యాపారాలు బాగా సాగును. సరుకులు నిల్వచేయు వారికి విశేషలాభాలు.కార్పొరేటుసంస్థలలో ఉన్నవారికి బాగుంటుంది. జాయింటువ్యాపారులకుభాగస్వాములమధ్య సరైనఅవగాహనతోనూతనవ్యాపారాలు చేయుదురు. రియల్ ఎస్టేటు వ్యాపారులకు మంచి లాభాలు, వస్త్ర వ్యాపారస్తులకు అంతంతమాత్రమే. బిల్డింగ్‌నిర్మాణపనులు చేయువ్యాపారులకు బాగా కలిసివచ్చును.

ఈసం॥రం విద్యార్థులకు వ్యయమందు గురుని ప్రభావంచే జ్ఞాపకశక్తి తగ్గును. ఆశించిన మార్కులు పొందలేరు. కొన్ని సబ్జక్టులు నిలచిపోవును. ద్వితీయార్థం బాగుండును. కాని ప్రథమార్థంలోనే మెడికల్, ఇంజనీరింగ్, లాసెట్, బి.యిడి, ఐసెట్, ఆసెట్ మొ॥లగు ఎంట్రన్స్ పరీక్షలు వ్రాయుదురు గాని మంచిర్యాంకులు పొందలేరు. ద్వితీయార్థంలో అయితే విదేశీ చదువులందు రాణింపు ఉంటుంది.

వ్యవసాయదారులకు మొదటిపంటకంటే రెండవపంటలోవిశేషంగా లాభించును. కౌలుదార్లకులాభమే. గత సం॥రం చేసిన ఋణాలుతీర్చగలరు. స్థిరాస్తివృద్ధి గృహలాభాలు. చేపలు, రొయ్యల చెరువులు చేయువారికి విశేషంగా లాభించును.

**స్త్రీలకు :-** ఈ సం॥రం స్త్రీలకు మహోన్నతకాలంగా చెప్పవచ్చును. గత కొద్ది కాలంగా పడుచున్న బాధలు తొలగిపోవును. మీ గొప్పతనం ఓర్పు, సహనంవల్ల ఖ్యాతిని పొందగలరు. మీ మాటకు విలువపెరుగును. మీ పేరుతో సిరాస్తులుగాని గృహంగాని, విలువైన వస్తువులు కొంటారు. భార్యాభర్తలమధ్య సరైన అవగాహన ఉంటుంది. అందరూ మిమ్మల్ని అనుకరిస్తారు. గతంలో విడిపోయిన భార్యాభర్తలు గాని దూరంగాఉన్న వారుగాని ఈసం॥రం తప్పక కలుసుకుంటారు. గృహజీవితా నందం పొందగలరు, ఉద్యోగాదులు చేయువారికి కోరుకున్న చోట్లకు బదిలీలు.

మొత్తంమీద ఈరాశి స్త్రీ,పురుషాదులకు జూలై నుండి యోగదాయకమైనకాలం అన్నిరంగాల వారికి లాభాలే. వచ్చే 3సం॥రంల వరకు తిరుగులేకుండాఉంటుంది.

**చేయవలసిన శాంతులు:-** ఈరాశివారికి మీ పరిస్థితులు అనుకూలంగా ఉండుటచే ఇతరుల ఈర్ష్య,అసూయ,ద్వేషంపెరుగును.అందుకుమంగళ, శనివారనియమాలు పాటించాలి. నరఘోష అధికం.పుణ్యక్షేత్ర సందర్శన, శ్రీశైలక్షేత్రం దర్శించండి. మంగళవారం రోజున మీగ్రామంలోగల శివాలయంలో అభిషేకం చేయించుకోండి. నరఘోష, నవగ్రహ శాంతి యంత్రాలు ధరించండి. **రూ.1300/-లు అగును. సొమ్ము బుట్టే వీరభద్ర దైవజ్ఞ, తిలక్‌రోడ్ రాజమహేంద్రవరం - 533 103 అను అడ్రసుకు M.O. ద్వారా లేదా ఈ క్రింది ఫోన్ నెంబరుకు 90005 72660 Phonepe, Google pay, Paytm ద్వారా చెల్లించి, మీ వివరాలు లెటరు ద్వారా తెలపండి. మీపేరు, గోత్రంతో యంత్రాలు పూజించి 25 రోజులలో పోస్ట్ ద్వారా పంపగలము.**

**ఏప్రియల్:-** అన్నిరంగములవారికి బాగుంటుంది. చేయువృత్తి , వ్యాపారాలందు రాణింపుఉంటుంది. ఆరోగ్యలాభాలు, ధనలాభం, రానిబాకీలువసూలగుట, కోర్టు వ్యవహార జయం, గృహంలో శుభకార్యాలు, ఉన్నతమైన స్థితి ప్రభుత్వ సంబంధ వ్యవహారములందు అనుకూలత. సంతాన సౌఖ్యం, నూతన స్త్రీ పరిచయాలు.

**మే :-** ఈనెలలోగ్రహాల అనుకూలసంచారంవల్లఅన్నివిధాలుగాయోగమే.సంతాన సౌఖ్యం, ఆరోగ్యంబాగుంటుంది. ఆర్థికలావాదేవీలు సంతృప్తి. నూతనకార్యాలకు శ్రీకారంచుట్టెదరు.కుటుంబసౌఖ్యం, కొన్నిసమస్యలు మబ్బు విడినట్లు విడిపోవును. నూతన పరిచయాలు లాభించును. మాసాంతంలో సోదరమూలక విరోధాలు.





**జూన్ :-** ఈనెలలోప్రథమార్థంబాగుంటుంది.అన్నిరంగాలవారికిఅనుకూలించును. ద్వితీయార్థంలో అనుకూలించదు. చేయుప్రయత్నాలందుఆటంకాలు, బంధుమిత్రాదులతో విరోధాలు. సంతానంవల్ల ఇబ్బందులు. పితృలేదామాతృవంశ సూతకాలు. ఆర్థికంగాఇబ్బందులు, ప్రయాణములందు ఆటంకములు. ఆందోళన కల్గించును.

**జూలై :-** ఈ నెలలోకూడా గ్రహస్థితులు అనుకూలంగానేనందున శారీరక పీడలు, వాహనప్రమాదాలు, ఆరోగ్యభంగాలు, చేయువృత్తి వ్యాపారాదులలోనష్టాలు, ఊహించని సంఘటనలు, ఎన్నికష్టాలు వచ్చిన నిలద్రొక్కుకుంటారు. అవమానకర సంఘటనలు జరుగును. సంతానం వల్ల ఇబ్బందులు. నమ్మినవారి వల్ల మోసపోవుట జరుగును. ఆర్థికంగా ఇబ్బందులు. ఊహించని సమస్యలు ఎదురగును. ధైర్యంగా ఎదుర్కొనగలరు.

**ఆగష్టు :-** అన్నిరంగాలవారికిఅనుకూలమే.రాణింపుఉంటుంది.ఆర్థికంగాబాగుంటుంది. సమస్యలుపరిష్కారమగును. ఆరోగ్యంబాగుంటుంది. శత్రువులపైఆధిక్యత, మిత్రులసహాయసహకారాలు,వాహనసౌఖ్యం, బంధుమిత్రలాభములు, సంఘంలో గౌరవలాభాలు,భార్యతో సరైనఅవగాహన, నూతనపరిచయాలు అనుకూలించును.

**సెప్టెంబర్ :-** గ్రహాలఅనుకూల సంచారంవల్ల చేయు వృత్తి,వ్యాపారాలు అనుకూలించును. ధనలాభములు ఎంతోకాలముగాఉన్న పనులు పూర్తిఅగును. శత్రువులే మిత్రులగుదురు. శారీరకసౌఖ్యం, పితృవంశ సహకారంలభించును. నూతనవ్యక్తుల పరిచయాలు, అధికారుల సహాయసహకారములు లభించును. ప్రయాణసౌఖ్యం.

**అక్టోబర్ :-** ఉత్సాహంగా,ఉల్లాసంగా ఉంటారు. ఆరోగ్యం బాగుంటుంది. కోర్టు వ్యవహారజయం, ధనమునకులోటుండదు. కుటుంబవృద్ధి, శుభకార్యలాభములు, సంఘంలో కీర్తి పెరుగును. పెద్దవారు సహితం మిమ్మల్ని ప్రత్యేకంగా గుర్తిస్తారు. శత్రువుపై ఆధిక్యత, స్త్రీ సౌఖ్యం, అన్నింటా విజయమే. తీర్థయాత్రా ఫలప్రాప్తి.

**నవంబర్ :-** గ్రహముల అనుకూల సంచారంవల్ల చేయు వృత్తి, వ్యాపారాలందు అనుకూలత. ఆర్థికంగాబాగుంటుంది. ఉత్సాహంగా, ధైర్యంగా ముందుకుపోగలరు. యశోభూషణప్రాప్తి. సంతానసౌఖ్యం, ఆరోగ్యలాభం, కీర్తివృద్ధి, సమస్యలు పరిష్కారం,ఇతరులకు సలహాలుఇచ్చుట, కొన్నింటిలో మధ్యవర్తిత్వం చేయుదురు.

**డిశంబర్ :-** అన్నివిధాలుగా బాగుంటుంది.ఆరోగ్యలాభాలు, ధనలాభములు, పరాక్రమంతో ధైర్యంగా ఉంటారు. ప్రయాణాలు లాభించును. నూతన కార్యములు ప్రారంభించుట,వాహనసౌఖ్యం, జీవితంఆనందంగాఉంటుంది. కుటుంబసౌఖ్యం, మీమాటకు తిరుగుండదు. పట్టిందల్లా బంగారమా? అనునట్లుండును. సంతానంవల్ల శుభవార్తలు వింటారు. భూసంబంధ వ్యవహారాలు అనుకూలించును.

**జనవరి :-** గ్రహసంచారంబాగా అనుకూలించుటచే ఏపనితలపెట్టినా అవలీలగా పూర్తిచేస్తారు. నూతనవస్తు,వస్త్రప్రాప్తి,బంధుమిత్రుల కలయిక, దూరప్రయాణాలు చేయుట, వాహనసౌఖ్యం, ఉన్నతవ్యక్తులతోకలయిక,భూసంబంధ వ్యవహారాదులందుజయం, పాతమిత్రులనుకలుసుకుంటారు.బంధుమిత్రులతోకలిసి విందులు.

**ఫిబ్రవరి :-** ఈనెలలోకూడాఅన్నిరంగాలవారికిబాగుంటుంది.ఆరోగ్యరీత్యాకొంత ఇబ్బందులు.శిరోపీడలుతప్పవు.వ్యవహారాదులలో మీదే పైచేయి. వృత్తి వ్యవహారాలు బాగా కలిసివచ్చును. గృహంలో శుభకార్యలాభములు. సంతానసౌఖ్యం. శత్రువుపై ఆధిక్యత. కోర్టువ్యవహారాలు అనుకూలత. కోపంఅధికం. ప్రతీ చిన్న విషయానికి కంగారుపడుదురు. కొన్ని విషయములందు వ్యతిరేకంగా ఉండును.

**మార్చి :-** అష్టమందు గ్రహసంచారంవల్ల కొంతఇబ్బంది.అలసట,శారీరకశ్రమ, వృధాగాకాలక్షేపంచేయుట,పనులందుఆటంకాలు, బద్ధకం, బంధుమిత్రాదులతో విరోధాలు,కళత్రవంశంవారితోపట్టింపులు,మనోవ్యాకులతకలిగించుసంఘటనలు జరుగును. సంతానంవల్ల ఇబ్బందులు, విద్యార్థులు పరీక్షలు వ్రాయుటకు బాగా కష్టపడవలసి వస్తుంది. జ్ఞాపకశక్తి తగ్గును. ఉద్యోగులకు స్థానచలనములుతప్పవు.





Scanned with OKEN Scanner



# సింహరాశి ఫలితములు

## LEO

మఘ 1,2,3,4 పాదములు
పుబ్బ 1,2,3,4 పా॥ ఉత్తర 1 పాదము

ఆదాయం - 11 వ్యయం - 11 | రాజపూజ్యం - 3 అవమానం - 6

**ఈ రాశి వారికి ఈ సంవత్సరములో గ్రహములదోషకాలములు**

**రవి :** సంవత్సరాది నుం' 13-4-2025 వరకు అష్టమం, 17-7-2025 నుండి 17-9-2025 వరకు ద్వాదశం, జన్మం, 17-11-2025 నుండి 15-12-2025 వరకు అర్ధాష్టమం **కుజుడు :** సంవత్సరాది నుండి 26-7-2025 వరకు ద్వాదశం, జన్మం, **గురుడు :** ఈ సం॥రం శుభుడే **శని :** 17-4-2025 నుండి 9-10-2025 వరకు అష్టమం, తిరిగి 11-1-2026నుండి సం॥రం ఆఖరు వరకు అష్టమం **రాహువు :** 15-5-2 2' వరకు అష్టమం **కేతువు :** 16-5-2025 నుండి సం॥రం అంతా జన్మ

ఈ రాశి స్త్రీ పురుషాదులకు శుభాశుభ మిశ్రమ ఫలములుగా ఉండును. మీలోఎన్నిరకాలుగా శక్తి సామర్ధ్యములున్నా ముందుకు వెళ్ళలేకుండుట జరుగును. అకారణముగా మాటలు పడుట, రావలసిన బాకీలు రాకుండుట, ఆదాయంలో అంతరాయములు, లోలోపల అధైర్యం ఏర్పడును. రక్తబంధువర్గంలో కలతలు, అశాంతి, ఆరోగ్యరీత్యా మనస్సుకు హెచ్చరిక లేకుండుట గుప్త శత్రుబాధలు ఏర్పడును. స్వవిషయంలో కన్నా పైవారి పనులందు శ్రద్ధ హెచ్చును. లేనిపోని అనుమానాలకు మనస్సులోనగుట, మీ సొమ్ముతిని ఉపకారం పొందినవారే శత్రువులుగా పరిణమించుట జరుగును. ఆడవారి ప్రేరేపణచే జరుగుపనులలో ఆందోళన హెచ్చును. ధనవ్యయం మీద కొట్టివేయును. పుణ్యక్షేత్ర సందర్శన, పెద్దలను సేవించుట. గృహమార్పులు,ప్రయాణాలలో ఒత్తిడి,కలవరం, శరీరంలో తెలియని వ్యాధిఉండి ఔషధసేవలు చేయుట, దొంగలవల్లభయం, సాంఘికంగా అపనిందలు, గౌరవాదులలోమార్పువచ్చును. ఆత్మీయులు పెరుగును. బంధువర్గంలో పూజ్యతతగ్గును. ధనఒత్తిడి,మాటామాటాపట్టింపులు, శారీరక సుఖాదులు తక్కువ. ప్రతివిషయంలో తొందరపడక నిదానించి పనులు జరుపుకున్న మంచిది. కోర్టు, కుటుంబచిక్కులు,అనారోగ్యం,ఇతరులచే దగాపడుట,ఔషధసేవలు చేయుట జరుగును. సంతానంకు పీడలు, ఆలోచించి నిర్ణయాలు తీసుకొనిన మంచిది.

ఉద్యోగులకు ఈసం॥రం కాలం కలిసిరాదు. ఎంతపనిచేసినా అధికారులు మిమ్మల్ని వేధిస్తూనే ఉంటారు. మీ తెలివితేటలు ఏమీ పనిచేయవు. అవమానాలకు గురిఅగుదురు. కేంద్ర,రాష్ట్రప్రభుత్వంలోఉన్నవారికి సుదూరప్రాంతాలకు బదిలీలు, కేసులందు ఇరుక్కొనుట,లేనిపోని నిందలు మీపై వచ్చును. ఏసిబి వారికి దొరికి పోవుదురు. ప్రవేటుకంపెనీలందు పనిచేయువారు మరొక కంపెనీకి మారుదురు. యాజమాన్యంయొక్క గుర్తింపుపొందలేరు.నిరుద్యోగులకు ఈసం॥రంకూడా నిరాశే మిగులును. స్థిరత్వం పొందలేరు. పర్మినెంటు కాని ఉద్యోగులకు పర్మినెంటుకాదు.

రాజకీయనాయకులకుకూడా అంతయోగదాయకంకాదు. ధనంమంచి నీళ్ళ వలెఖర్చుఅగును. అధిష్టానంవారి మన్ననలుపొందలేరు. ప్రజలలోకూడా వ్యతిరేకత అధికంగాఉంటుంది. కనీసం నామినేటడ్ పదవైనా పొందుట కష్టమే అగును. మీకురావలసినవిఇతరులుతన్నుకుపోవుదురు. ఎన్నికలలోఓటమి పాలగుదురు.





కళాకారులకు శనిబలం లేని కారణంగా నూతన అవకాశాలు అంతంత మాత్రమే. విజయాలుసిద్ధించవు. అవార్డులు,రివార్డులుపొందలేరు. టి.వి, సినిమా, నాటకరంగములో ఉన్నవారికి నిరాశే మిగులును. ఆర్థికంగా ఇబ్బందులు తప్పవు. గాయనీ,గాయకులు,డైరెక్టర్స్ ఇతర టెక్నీషియన్స్ కూడా అవకాశాలు సన్నగిల్లును.

ఈసం॥రం వ్యాపారస్తులకు మిశ్రమఫలితాలు. గురు,శనుల ప్రభావం వల్ల కొన్నివ్యాపారాలునష్టాలువచ్చును.కొన్నింటియందులాభాలువచ్చును.రిటైల్‌వ్యాపారులకు బాగుంటుంది. హోల్‌సేల్ వ్యాపారులకు రాణింపు ఉండదు. జాయింటు వ్యాపారస్తులు విడిపోవుదురు. మనస్పర్ధలు పెరుగును. గృహనిర్మాణరంగంలోఉన్న వారికి వడ్డీవ్యాపారులకుబాగుంటుంది. షేర్‌మార్కెట్‌లో ఉన్న వారికి విపరీతనష్టాలు తప్పవు. ఆస్తులుఅమ్ముకోవలసివచ్చును. సరుకులునిల్వచేయువారికిలాభించును.

ఈసం॥రం విద్యార్థులకు ఈ సం॥రం జ్ఞాపకశక్తి తగ్గును. చదువులందు మనస్సులగ్నంచేయలేరు. ఇతర వ్యాపకములు పెరుగును. ఆశించినంత మార్కులు రావు. ఏదోలాఉత్తీర్ణతపొందగలరు. విదేశీచదువులందుఆటంకాలుతప్పవు. ఇంజనీరింగ్, మెడికల్,బి.యిడి.లాసెట్,ఐసెట్,ఆసెట్ మొ॥లగు ఎంట్రన్స్ పరీక్ష లందు మంచి ర్యాంకులు పొందలేరు. కొంత మందికి చదువులు మధ్యలో నిలచిపోవును.

వ్యవసాయదారులకు కొంతమేరఫర్వాలేదు. మొదటి పంటకంటే రెండవపంట లాభించును. కౌలుదార్లకు నష్టాలుతప్పవు. చేపలు,రొయ్యలుచెరువులు చేయువారికి కొంత అనుకూలించును. లాభములు పెద్దగా రావు. ఋణములు తీరవు. క్రొత్త ఋణములు చేయవలసి వచ్చును. ఫౌల్ట్రీ రంగంలో ఉన్నవారికి లాభములు.

**స్త్రీలకు :-** ఈసం॥రం ఈరాశి స్త్రీలకు అంతయోగదాయకంగా ఉండదు. మీరు లేనిపోని అపనిందలకుగురికావలసివచ్చును. ఎంతటి తెలివితేటలుఉన్నా గుర్తింపు పొందుట కష్టమే అగును. విలువైన వస్తువులు దొంగలద్వారా పోగొట్టుకుంటారు. మాతృవంశీకులతో విరోధాలుతప్పవు. భార్యాభర్తలమధ్య సరైన అవగాహన ఉండక చీటికిమాటికీ తగాదాలు ఏర్పడును. ఒక్కొ సమయాన విడిపోయేంత పరిస్థితి ఉంటుంది గాన ఓర్పుతో, సహనంతోఉండాలి. ఒక్కోసారి వేధింపులకు గురికావలసి వచ్చును. అధికారుల వల్ల ఇబ్బందులు తప్పవు. గర్భిణీస్త్రీలకు ఆపరేషన్ జరుగును. పుత్రసంతానప్రాప్తి. వివాహంకాని స్త్రీలకు ఈసం॥ రం కూడా కష్టమే.

మొత్తంమీద ఈరాశి స్త్రీ పురుషాదులకు మిశ్రమంగా ఉండును, జన్మకేతువు, సప్తమ రాహువు ప్రభావం అధికంగా ఉండుటచే ప్రతినిమిషం జాగ్రత్తగా ఉండేది.

**చేయవలసిన శాంతులు :-** మంగళ,శనివార నియమాలు పాటించాలి. కేతు, శనికి జపాలు, హోమాలు జరిపించిన మంచిది. మీ గ్రామంలోగల శివాలయంలో రుద్రాభిషేకం చేయించుకోండి. శ్రీశైలక్షేత్ర సందర్శన, నమశ్శివాయ మంత్రం ప్రతిరోజు 108 సార్లు జపించండి. శని, కేతు యంత్రాలు ధరించిన మంచిది.

రూ.1300/-లు అగును. సొమ్ము బుట్టే వీరభద్ర దైవజ్ఞ, తిలక్‌రోడ్, రాజమహేంద్రవరం - 533 103 అను అడ్రసుకు M.O.ద్వారా లేదా ఈ క్రింది ఫోన్ నెంబరుకు 90005 72660 Phonepe, Google pay, Paytm ద్వారా చెల్లించి, మీ వివరాలు లెటరు ద్వారా తెలపండి. మీపేరు, గోత్రంతో యంత్రాలు పూజించి 25 రోజులలో పోస్ట్ ద్వారా పంపగలము.

**ఏప్రియల్ :-** ఈనెలలోప్రథమార్థం అంతగాఅనుకూలతఉండదు. అన్నింటాఅపజయమే. ఆరోగ్యభంగాలు,వ్యవహారనష్టాలు. పనులందుఆటంకాలు,వాహనప్రమాదం, ఆర్థికఇబ్బందులు. బంధుమిత్రాదులతో మాటామాటాపట్టింపులు. అనేకసమస్యలు తలెత్తుట,శత్రుమూలకఇబ్బందులు, విపరీతధనవ్యయం, కేసులందుఇరుక్కొనుట.

**మే :-** అన్నిరంగాలవారికి చేయు వృత్తివ్యాపారాలు రాణించును. కొన్ని సమస్యల నుండి బయటపడతారు. ఆర్థికంగా బాగుంటుంది. ధైర్యంగా ముందుకు పోగలరు. గృహంలోశుభకార్యాలుజరుగును. సంతానసౌఖ్యం, స్త్రీ మూలక ధనలాభ ములు, శత్రుజయం, సంఘంలో ఉన్నతస్థితి,ద్వితీయార్థం బాగుండును. వాహన సౌఖ్యం.

ఆదాయంనకుఫర్వాలేదు. వృత్తివ్యాపారాలు బాగా

**జూన్ :-** ఆరోగ్యలాభం. మిత్రులసహాయసహకారాలు లాభించును. మాతృసౌఖ్యం, సంతాన చును. మిత్రులసహాయసహకారాలు లాభించును. శత్రువులే మిత్రులగుదురు. కుటుంబసౌఖ్యం, నూతనకార్యజ లాభములు, శత్రువులే మిత్రులగుదురు. పెద్దవారితో పరిచయాలు, ప్రయాణలా స్త్రీ మూలక సహాయంలభించును.

**జూలై :-** మిశ్రమఫలితాలు,ఆదాయంనకుమించినఖర్చులు.ప్రయాణాలుచే వలసి వచ్చును. ఆరోగ్యభంగాలు తప్పవు. పుణ్యనదీస్నానాలు, కొన్నిముఖ్య కార్యాలు వాయిదాపడును. నమ్మినవారే దగా చేయుదురు. వ్యవహార ఆటంక సంతానంద్వారా ఇబ్బందులు,మధ్యవర్తిత్వంలోవ్యతిరేకత, పితృలేదామాతృ, క వర్గంవారితో విరోధాలు. జన్మకుజునివల్ల ప్రమాదాలు. పితృవర్గ సూతకము

**ఆగష్టు :-** ఈనెలలో 1,12స్థానాలలో గ్రహసంచారం లాభించదు. చీటికీమా ఉద్రేకపడుట,శిరోబాధలు, అసహనమునకు గురిఅగుట,అందరితోనూవిరోధా ఆదాయంనకు మించినఖర్చులు,చెడువ్యసనాలుఅలవాటుఅగుట,ఏమిమాట్లా ఇతరులకు నచ్చకపోవుట కార్యాలు నిలచిపోవుట,అవమానకర సంఘటన

**సెప్టెంబర్ :-** ఈనెలలో కొంతఫర్వాలేదు. ఏపనిలో అయినానష్టాలే. మీ ఉద్రేక కోపంవల్ల అనేకవిషయాలలోనష్టపోవుదురు. మీప్రవర్తనఇతరులకునచ్చదు. ప్ర చిన్నదానికి ఉద్రేకపడుదురు.చేయనిపనులకుశిక్ష అనుభవించవలసివచ్చు ఆరోగ్యం బాగుండును. ఆర్థికంగా ఫర్వాలేదు సమయానికి ధనం లభించు

**అక్టోబర్ :-** ఈ నెలలో గ్రహసంచారం కొంత ఫర్వాలేదు. చేయు వృత్తివ్యాపా లందు అన్నిరంగములవార్కి లాభించును. ఆర్ధిక పరిస్థితి బాగుండును. ఆరోగ్య బాగుండును.ధైర్యంతోముందుకుపోగలరు.సోదరమూలకలాభాలు.వాహనసౌఖ్య వాహన మార్పులు, సంతాన సౌఖ్యం. దైవ సంబంధ కార్యాలందు పాల్గొంటా

**నవంబర్ :-** గతకొంతకాలంగాపడుచున్నబాధలనుండికొంతఊరటలభించు చేయువృత్తివ్యాపారాలందురాణింపు.ఆదాయంఫర్వాలేదు.ఆరోగ్యంకుదుటపడు మనస్సుకుప్రశాంతత,బంధుమిత్రుల సహాయసహకారం లభించును. శత్రుజయ భార్యాభర్తలమధ్య సరైన అవగాహన ఉంటుంది. నూతన కార్యములకు శ్రీకార

**డిశంబర్ :-** చేయువృత్తివ్యాపారాలుబాగుండును.ఆర్థికంగాకొంతమేరఫ లేదు. మీ శ్రమ ఫలించును. వాహనమార్పులు, సౌఖ్యం, గృహంలో మార్పు చేస్తారు. మనోధైర్యంహెచ్చును. యుక్తిగామాట్లాడికార్యాలు పూర్తిచేసుకొంటా ఆరోగ్యం బాగుండును. ఉత్సాహంగా, ఉల్లాసంగాఉంటారు. నూతన కార్యజయ ప్రయాణసౌఖ్యం, నూతన స్త్రీ పరిచయాలు. ఇష్టమైన వాటిని దక్కించుకుంటా

**జనవరి :-** అన్నింటాజయం,అన్నిరంగాలవారికియోగదాయకమే. వ్యవహా దులు లాభించును. శరీరసౌఖ్యం, ఆరోగ్యలాభం, ఆదాయంనకు లోటుండదు రావలసిన బాకీలు చేతికందును. ఎంతటి కార్యాన్నయినా సాధించగలరు. ఉన్న వ్యక్తులపరిచయం, మీగౌరవంపెరుగును. శత్రుజయం, భార్యాభర్తలమధ్య సఖ్య నూతన వస్తు, వస్త్ర ప్రాప్తి, బంధుమిత్రులతో కలిసి విందులు, వినోదములు

**ఫిబ్రవరి :-** ఈనెలలోమిశ్రమఫలితాలుఉండును.వృత్తి,వ్యాపారాలు ఆశించినం మేర జరుగవు. ప్రతిచిన్నదానికి గాబరా పడుదురు. పరామర్శలుచేస్తారు. పి లేదా మాతృవంశసూతకాలు.ఆందోళన, ఊహించని సంఘటనలు జరుగును మనోవేదన కలిగించును, చికాకులు కలుగును. స్పెక్యులేషన్ నష్టం. స్త్రీ విరోధ

**మార్చి :-** అన్నిరంగాలవారికి ఇబ్బందులే. ఆరోగ్యభంగాలు. నేత్ర, శిరోపీడలు వాహనప్రమాదాలు, బంధుమిత్రులతో సమస్యలు, కావలసినవారు దూరమగుట వ్యాపారాదులు మధ్యలో నిలచిపోవుట,ఇతరులు మీ పట్ల అమర్యాదగామాట్లా డుట, నూతన సమస్యలు తలెత్తును. వివాహాది శుభకార్యములకు హాజరగుదురు







# కన్యరాశి ఫలితములు

## VIRGO

**ఉత్తర 2,3,4 పాదములు**

**హస్త 1,2,3,4,పా॥ చిత్ర 1,2 పాదములు**

**ఆదాయం - 14 వ్యయం - 2** | **రాజపూజ్యం - 6 అవమానం - 6**

### ఈ రాశి వారికి ఈ సంవత్సరములోగ్రహములదోషకాలములు

**రవి :** 14-4-2025 నుండి 14-5-2025 వరకు అష్టమం, 18-8-2025 నుండి 17-10-2025 వరకు ద్వాదశం, జన్మం, 16-12-2025 నుండి 14-1-2026 వరకు అర్ధాష్టమం. **కుజుడు :** 5-6-2025 నుండి 11-9-2025 వరకు ద్వాదశం, జన్మం, 7-12-2025 నుండి 15-1-2026 వరకు అర్ధాష్టమం, **గురుడు :** ఈ సం॥రం శుభుడే. **శని :** ఈ సం॥రం శుభుడే **రాహువు :** 16-5-2025 వరకు సప్తమం **కేతువు :** ఈ సం॥రం అంతా జన్మం, ద్వాదశం

ఈ రాశి స్త్రీ పురుషాదులకు విద్యా, కళత్ర కారుకుడైన గురుడు 10 లోనూ మరియు శని బలీయుడు. గాన అత్యధిక ప్రాముఖ్యతతో కూడిన జీవితమును గడుపుదురు. రాజకీయంగాఉద్యోగవిద్యా,కళా,సాంఘికరంగాలలో మీదే పై చేయి అనునట్లుండును.చాతుర్యంతోపట్టుదలతోను,ఎలాంటివ్యక్తులనుగాని లెక్కచేయరు. సమస్యలను కూడా లెక్కచేయరు. స్త్రీ, పురుషాదులను వశంచేసుకొని జీవితం గడుపుదురు. వాహనసుఖం, వివాహాదులు జరగవలసిన వారికి వారిఆశయాలకు తగినవారితో సంబంధంలేర్పడును. స్త్రీ ప్రభావం మీకు సహకరించును. భార్య ఇష్టప్రకారంగానడచుకునేది. ఆమెప్రభావంచేతనువిలువైన వస్తువులను సేకరించుట గృహజీవితానందం,పుణ్యక్షేత్రసందర్శన,పుణ్యకార్యాలు చేయుటకలుగును. సంఘంలో పేరుప్రతిష్ఠలు పెరుగును. స్థలమార్పులు, గృహమార్పులు తాముపట్టినది బంగారము అనునట్లుండును. మీ స్నేహ పరిచయం కావాలని ఇతరులు ముందుకువస్తారు.చాలాగణనీయమైన ఉత్తేజకరమైనజీవనంపొందుట, ఆదాయాభివృద్ధి, గృహంలో శుభకార్యాలుకలిసివచ్చుట, కోర్టుదావాలు, అప్పీల్‌లో జయం కలుగును. ఒక్కోసారి అధికంగా కోపంవచ్చుటవల్ల కొన్నికార్యాలు నిలచి పోవును. చివరికితిరిగి సర్దుకొని కార్యాలు పూర్తి చేస్తారు. మీ కోపమే మీకు శత్రువుఅగును.

ఈ సం॥రం ఉద్యోగులకు బాగా కలసివచ్చును. గత కొద్దికాలంగా పడుచున్న బాధలు తొలగిపోవును. ఉల్లాసంగా, ఉత్సాహంతో ఉంటారు. అధికార మన్ననలు పొంది ప్రమోషన్‌తో కూడిన బదిలీలు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు ప్రమోషన్స్ మీపనికి తగ్గ గుర్తింపు లభించును. ప్రవేటు కంపెనీలందున్న వారికి యాజమాన్యం మద్దతులభించుట మీ ప్రతిభను గుర్తించి ఉన్నత స్థానములను కల్పించెదరు. గృహనిర్మాణాలు, జీవితంలో స్థిరత్వం పొందగలరు. పర్మినెంటు కానివారికి ఈసం॥రం తప్పని సరిగా పర్మినెంటు అగును.

రాజకీయ నాయకులకుకూడా ఈసం॥రం మంచికాలం. కష్టానికితగిన ఫలితం లభించును. మీ సేవలను అధిష్ఠానవర్గం గుర్తించి ఏదో ఒక నామినేటడ్ పదవిఇస్తారు. ప్రజలలోకూడామంచిగుర్తింపు, ధనంఖర్చుఅయినాఅధికారం లభించును. ఎన్నికలందు పోటిచేసి నట్లయితే తప్పక విజయం సాధించగలరు.

కళాకారులకు మాత్రం అంత అనుకూలత ఉండదు. విజయాలు లేక నూతన అవకాశాలు అంతంతమాత్రమే. మీకు రావలసిన అవార్డులు మరొకరికి వెళ్ళును. టి.వి, సినీరంగంలోఉన్నవారికి గాయనీ, గాయకులకు, టెక్నీషియన్స్, డైరక్టర్లకు రచయితలకు నూతన అవకాశములు రాక ఇబ్బందులు తప్పవు. విజయాలు తగ్గును. మనోధైర్యం కోల్పోవుదురు. వివాదాస్పదమైన వాటిలో ఇరుక్కొంటారు.

ఈసం॥రం వ్యాపారస్థులకు అనుకూలమే. ఆశించినంత మేర లాభములు పొందగలరు. హోల్‌సేల్,రిటైల్ వ్యాపారులకు బాగుంటుంది. నూతన వ్యాపారాలు ప్రారంభిస్తారు. జాయింటువ్యాపారులుమాత్రం భాగస్వాములతో భేదాభిప్రాయాలు వల్ల విడిపోవుట. ఫైనాన్సువ్యాపారంబాగుంటుంది. పరిశ్రమలవారికిఅనుకూలమే. బిల్డింగ్ నిర్మాణరంగంలోఉన్నవారికి, క్రొత్త కాంట్రాక్టర్లకు చాలా మంచియోగం.

ఈసం॥రం విద్యార్థులకు గురుడు ప్రారంభంలో బలీయంగా తదుపరి 10వ ఇంట ఉండును గాన బలీయంగా ఉండును. జ్ఞాపకశక్తి బాగుంటుంది. పరీక్షలు బాగావ్రాసి మంచిమార్కులు సాధిస్తారు. ఇంజనీరింగ్, మెడికల్, బి.యిడి, లాసెట్, ఐసెట్, ఆసెట్ మొ॥లగు ఎంట్రన్స్‌పరీక్షలందు మంచిర్యాంకులుపొంది కోరుకున్న కాలేజీలలో సీట్లను పొందగలరు. శని, రాహువు వల్లచదువులందు ఆసక్తి తగ్గును. ఇతరవ్యాపకాలతోకొన్నిసబ్జెక్టులందు ఫెయిల్‌అగుదురు. క్రీడాకారులకుఅనుకూలం.

వ్యవసాయదారులకు రెండుపంటలుఫలించును. ఆర్థికసమస్యలనుండి బయట పడుదురు. పంట దిగుబడి పెరుగుటచే ఋణాలు తీరును. ప్రభుత్వ సహాయం లభించును. కౌలుదార్లకుఅనుకూలమే, గృహంలోశుభకార్యాలుజరుగును. చేపలు, రొయ్యలుచెరువులు చేయు వారికి, పౌల్ట్రీరంగంలోఉన్నవార్కి మంచి లాభాలు.

**స్త్రీలకు :-** ఈసం॥రం మంచి యోగదాయకం. మీ మాటకు తిరుగులేదు. ప్రతీ ఒక్కరూ మిమ్మల్ని గౌరవిస్తారు. కుటుంబంలో మీ విలువ పెరుగును. మీ పేరుతో స్థిరాస్థులుఏర్పడును. రాహువు, కేతువులు వల్లఆరోగ్యభంగాలుతప్పవు. నూతన రోగాలు, శస్త్రభయం, ప్రతీచిన్నవిషయానికి కలవరం, కాని శనిబలంవల్లకొంత మేరబాగుంటుంది. ఉద్యోగాదులలో ఉన్నవారికి ప్రమోషన్స్‌తో కూడిన బదిలీలు. అధికారుల అనుగ్రహం, వివాహంకాని స్త్రీలకు ఈసం॥రం తప్పకుండా వివాహం జరుగును. గర్భిణీస్త్రీలకు సులువుగా పురుడువచ్చును. స్త్రీ సంతానం కలుగును.

మొత్తంమీద ఈ రాశి స్త్రీ పురుషాదులకు బాధలన్నీ పోయి సుఖ, సౌఖ్యాదులు, గృహజీవితానందం పొందగలరనుటలో సందేహం లేదు.

**చేయవలసిన శాంతులు :-** రాహువు, కేతువులు వల్ల నరఘోష హెచ్చుటచే మంగళవార నియమాలు పాటించి రాహు,కేతువులకుజపం,హోమంచేయాలి. మీగ్రామంలోగలశివాలయంలో రుద్రాభిషేకంచేసినమంచిది. శ్రీశైలక్షేత్రసందర్శన. రాహువు,కేతువుయంత్రాలుధరించినమంచిది.



**ఏప్రియల్ :-** ఈనెలలో గ్రహసంచారం అంత అనుకూలంగాలేదు. చేయువృత్తి వ్యాపారాలందు రాణింపు. ప్రయాణంలో ప్రమాదాలు. బంధుమిత్రులతో విందులు. సంతానసౌఖ్యం,ఆర్థికలావాదేవీలందుతృప్తి. వ్యవహారజయం. ఆప్తబంధు అరిష్టాలు. స్థానచలనం, గృహమార్పులు తప్పవు. వివాహాది శుభకార్యములకు హాజరగుట.

**మే :-** అన్నిరంగాల వారికి లాభించును. అన్నింటా విజయమే. ఆరోగ్యం బాగుంటుంది. పనులువేగముగాపూర్తిఅగును. అనుకున్నదిసాధిస్తారు. కష్టమునకు తగిన ఫలితం కలుగును. వాహనసౌఖ్యం. శుభకార్యలాభం. సంతానసౌఖ్యం. స్త్రీ సౌఖ్యం. సంఘంలోఉన్నతస్థితి,నూతనపరిచయాలువల్లలాభాలు. బంధుమిత్రులతోకలయిక.





**జూన్ :-** గ్రహముల అనుకూల సంచారం వలన చేయు వృత్తి వ్యాపారములందు అనుకూలత, ఆరోగ్యలాభం,గృహలాభం. సంతోషకరవార్తలు వినుట. పెద్దవారితో పరిచయాలు. ప్రయాణసౌఖ్యం, కుటుంబవృద్ధి, ఆదాయంనకు లోటుండదు. వాహనమునకు మరమ్మతులు చేయించెదరు. కార్యములు వేగంగా పూర్తి అగును.

**జూలై :-** మానసికంగా ఉల్లాసంగా ఉంటారు. కాని ఆదాయం ఉండదు. కుటుంబ ఖర్చులువిపరీతంగాఉండును. ఋణాలుచేయవలసివచ్చును. దూరప్రయాణాలు లాభించును. చేయువృత్తివ్యాపారాలుబాగున్ననూఆర్థికవ్యవహారాలుసంతృప్తినివ్వవు. ముఖ్యవ్యవహారాలు నిలచిపోవును. జాయింటు వ్యాపారస్థులు విడిపోవుదురు.

**ఆగష్టు :-** అనేక ఈతిబాధలు ఆరోగ్యరీతా కూడాఇబ్బందులుతప్పవు. శస్త్రభయం, ఆందోళనకలిగించుసంఘటనలు, ప్రతీనిముషం కష్టంగానేఉంటుంది. ఆర్థికంగా బాగా నష్టపోవుదురు. ఋణములు చేయవలసి వచ్చును. సరైన సమయానికి ధనం చేతికందక అమర్యాదపాలగుదురు. చేయనిదానికి నిందలు పాలగుదురు.

**సెప్టెంబర్ :-** ఈనెలలోమిశ్రమఫలదాయకంగాఉండును. ప్రథమార్ధంలో ఆర్థిక పరిస్థితులు కొంతఅనుకూలమే. వృత్తివ్యాపారాదులురాణించును. గతంలో అంద వలసినధనం చేతికందును. పనులు పూర్తిచేయగలరు. ఆరోగ్యం కొంతపర్వాలేదు. పరామర్శలు చేయుదురు. పితృలేదా మాతృవర్గసూతకాలు. మనఃశ్శాంతి ఉండదు. కొన్నివిషయాలందు బాధలుకలిగించును. ఉద్యోగులకుగృహచలనములు తప్పదు.

**అక్టోబర్ :-** ఈనెలలోఅనుకూల గ్రహసంచారంలేనికారణంగాఅనేకఇబ్బందులు తప్పవు. మానసికంగాక్రుంగిపోవుదురు. ప్రతిచిన్న విషయానికి ఆందోళన, ధనం మంచినీళ్లవలె ఖర్చగును. బంధుమిత్ర విరోధములు, భార్యాభర్తల మధ్య సరైన అవగాహనఉండకవిరోధాలేర్పడును. వాహనప్రమాదం, నేత్రపీడలు కలిగించును.

**నవంబర్ :-** జన్మరాశిలో రవి, శుక్రులు సంచారం వలన ఉద్రేకం పెరుగును. ప్రతీ చిన్న విషయానికి గొడవలు ఏమి మాట్లాడిన విరోధమే వచ్చును ఇంతకు ముందు మెచ్చుకొనిన వారు కూడా వ్యతిరేకింతురు. ఆర్థికంగా చాలా నష్టపోవుదురు. పోలీసు కేసులందు ఇరుక్కొనుట. శారీరక గాయాలు. నేత్ర శిరోపీడలు,

**డిశంబర్ :-** ఈనెలలో కొంతమేర ఫర్వాలేదు. చేయువృత్తివ్యాపారాలు లాభించును. శారీరకశ్రమఅధికం. అకాలభోజనం,పనులందుఅసంతృప్తి. కానిఆర్థికంగా కొంతఉత్సాహంగాఉంటుంది. దూరప్రయాణములందు లాభములు. సంతానవృద్ధి, వ్యసనములు నిమిత్తం ధనవ్యయం. గృహంలో శుభకార్యములు జరుగును.

**జనవరి :-** అనుకూల గ్రహసంచారంవలన అన్నిరంగములవారికి చేయు వృత్తి వ్యాపారాలందు అనుకూలత. ఆర్థిక లావాదేవీలు సంతృప్తి, అనుకోని సమస్యలు పటాపంచలైపోవును. ఎంతటివారితోనైనా మాట్లాడగల ధైర్యంవచ్చును. వాహన సౌఖ్యం, నూతన పరిచయాలు కలిసివచ్చును. నూతన వస్త్ర, వస్త్రలాభములు. పాతమిత్రులను కలుసుకుంటారు. బంధుమిత్రులతో కలిసి విందులు,వినోదాలు,

**ఫిబ్రవరి :-** అన్నింటావిజయం,మీ మాటకు ఎదురులేకుండా ఉంటుంది. ఆరోగ్య లాభం, ఆదాయంనకు లోటుండదు. బంధుమిత్ర సమాగమం, వాహనసౌఖ్యం, ధైర్యంతోకూడిన పనులుచేస్తారు. సమస్యలు మబ్బువీడినట్లు విడిపోవును. సంతాన సౌఖ్యం, నూతన పరిచయాలు, కుటుంబసఖ్యత, వ్యాపారంలో మంచిలాభములు.

**మార్చి :-** ఈనెలలోనూ గ్రహసంచారం అనుకూలించుటచే అన్నివర్గములవారికి అనుకూలమే. చేయువృత్తి వ్యాపారాలు అనుకూలించి ధనలాభములు కలుగును. కోర్టు వ్యవహారములు మీకు అనుకూల తీర్పులు వచ్చును. దూరప్రయాణములు, వివాహాది శుభకార్యాలు జరుగును. పాతమిత్రులను కలుసుకుంటారు. విద్యార్థులు పరీక్షలుబాగా వ్రాయుదురు. ఉద్యోగులకు స్థానచలనం లేదా గృహచలనం కల్గును.



# తులారాశి ఫలితములు

## LIBRA

**చిత్ర 3,4,పాదములు, స్వాతి 1,2,3,4 పాదములు విశాఖ 1,2,3,పాదములు**

**ఆదాయం - 11 వ్యయం - 5** | **రాజపూజ్యం - 2 అవమానం - 2**

**ఈ రాశి వారికి ఈ సంవత్సరములోగ్రహములదోషకాలములు**

రవి : 15-5-2025 నుండి 15-6-2025 వరకు అష్టమం, 18-9-2025 ను... 16-11-2025 వరకు ద్వాదశం, జన్మం, 15-1-2026 నుండి 12-2-2026 వరకు అర్ధాష్టమం, కుజుడు : 27-7-2025 నుండి 26-10-2025 వరకు ద్వాదశం, జన్మం, 16-1-20... నుండి 22-2-2026 వరకు అర్ధాష్టమం, గురుడు : సంవత్సరాది నుండి 8-5-2025 వ... అష్టమం, శని : ఈ సం॥రం అంతా శుభుడే. రాహువు, కేతువులు : ఈ సం॥రం అంతా శు...

ఈ రాశి స్త్రీ పురుషాదులకు దైవబలం హెచ్చుగా ఉండును. ఆత్మవిశ్వాసం... ముందుకుపోగలరు. ధనము, సంపత్తు, కుటుంబము, పుత్రులకు కారకు... గురుడు 9వ స్థానములలోఉండుట, యోగకారకుడైన శని 6వ స్థానంలో ఉండు... విశేషమైన యోగఫలం శత్రువులు అంతరించుట వ్యవహారములలో జయ... గతంలో సాధించలేని పనులు ఈకాలంలో రెండింతలు ఫలించును. ఏ వ్య... వ్యాపారంలో ఉన్నవారికైనా సంవత్సర ప్రారంభం నుండి 2లేదా 3 మాసము... ఒడిదుడుకులు , ధననష్టం, గృహసంబంధ రీత్యా విపరీత ధనవ్యయం, రా... సిన సొమ్ముకు ఆటంకములు, అపనిందలు వంటివి కలిగినా అవి జూన్ నుం... అంతరించి ఉభయక్షేమం కలుగును. సాంఘికాభివృద్ధి,మనోవాంఛలు నెరవేరు... స్వశక్తి సామర్థ్యముచే పైకి రాగలుగుతారు. శత్రుత్వములు వచ్చినా అణచివేస్తా... నూతన ఆలోచనలు, పోకడలచే సంఘంలో గౌరవాదులు సిద్ధించును. పుణ్య... సందర్శనము, గృహములో శుభకార్యములు కలిసివచ్చుట. స్త్రీ పురుషాదుల... వివాహాది శుభకార్యాలు కలిసివచ్చుట. దాంపత్యానుకూలత, గృహజీవితానంద... కలును. కోర్టువ్యవహారాలందు,అప్పీలలోజయం.మీనడవడికనుచూచిసహించలే... వ్యక్తులువల్లఅనుకోనిబాధలువచ్చినావాటిని తట్టుకొనిముందుకుపోగలరు. నూ... వాహనలాభం, భూ,గృహంవంటి స్థిరాస్తులు లభించును. ఫైనాన్సువల్లలాభా...

ఈసం॥రం ఉద్యోగులకు యోగదాయకంగా ఉండును. గత కొద్దికాలం... పడుచున్నబాధలు పటాపంచలైపోవును. శనియోగకారకుడు అగుట, 6వ ఇం... ఉండుట మేలుజరుగును. ప్రమోషన్‌తో కూడినబదిలీలు. కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వం... ఉన్నవారికి అధికారులమన్ననలు, అప్రయత్న ధనలాభం,ప్రవేటుసంస్థల... పనిచేయువారికి యజమానుల మన్ననలు పొంది అధికజీతం వచ్చుటచే మరొ... కంపెనీకిమారుదురు. పర్మినెంటుకాని ఉద్యోగులకు పర్మినెంటు అగును... నిరుద్యోగులకు గురు, శనులబలం వలన ఖచ్చితంగా ఉద్యోగములు పొందుదురు...

రాజకీయరంగంలోఉన్నవారికి అనుకూలత ప్రజలలో మంచి గుర్తింపు గ... సం॥రం ఎన్నికలలోఓడిపోయిన ఈసం॥రంఅనుకూలించును. అధిష్టానం వా... మిమ్మల్నిగుర్తించి ఏదోఒక నామినేటడ్‌పదవి ఇస్తారు. శ్రమకుతగిన గుర్తింపు... వచ్చును. ఈసం॥రంఎన్నికలలో పోటీచేసిన విజయంతప్పక సాధించెదరు. రాహు... ప్రభావంవల్ల మనశ్శాంతి కరువగును. మీకున్న సామర్థ్యం మీకు కలిసివచ్చును...





కళాకారులకు ఈసం॥రం కీర్తి కారకుడైన గురుడు బలముగా ఉన్నందున మంచిగాఉంటుంది. అనుకున్నదిసాధిస్తారు. టి.వి.సినిమారంగంలోఉన్న గాయనీ గాయకులు, కవులు, డైరక్టర్లు, టెక్నీషియన్స్ అందరికీ నూతనఅవకాశములు లభించును. విజయాలు లభించుటచే అవార్డు, రివార్డులు తప్పక పొందగలరు.

ఈసం॥రం వ్యాపారస్తులకు అనుకూలంగా ఉండును. గతంలో ఆగిపోయిన బాకీలు ఈసం॥రం వసూలగును. అన్నివర్గములవారికి బాగుంటుంది. హోల్‌సేలు అండ్ రిటైల్‌వ్యాపారులకుమంచిలాభాలు. చక్రనివ్యాపారాలు జరిగి నిలద్రొక్కు కుంటారు. సరుకులు నిల్వచేయువారికి, బిల్డింగ్‌నిర్మాణాలు చేయువారికి ఇనుము, సిమెంటువ్యాపారులకువిశేషలాభం. ఫైనాన్సువ్యాపారులకుబాగుంటుంది.కాంట్రాక్టు దారులకు విశేషంగా యోగించును. పెద్దపెద్ద నూతన కాంట్రాక్టులు లభించును.

ఈసం॥రం విద్యార్థులకు గురుబలం బాగుండుటచే మంచి జ్ఞాపకశక్తివలన మంచిమార్కులతోఉత్తీర్ణత,చదువులందాసక్తి,ఎడగాలనేకోరిక,పట్టుదలతోముందుకు పోగలరు. ఉన్నత విద్యాభ్యాసంచేయుదురు. ఇంజనీరింగ్, మెడికల్, బి.యిడి, ఆసెట్, ఐసెట్ పాలిటెక్నిక్ మొ॥లగు ఎంట్రన్సు పరీక్షలు వ్రాయువారు మంచి ర్యాంకులు పొంది కోరుకున్నచోట సీట్లను పొందగలరు. క్రీడాకారులకు యోగమే.

వ్యవసాయ దారులకు రెండుపంటలు ఫలించును. గతంలో చేసిన అప్పులు తీర్చుదురు.ప్రభుత్వసహాయంలభించును.కౌలుదార్లకులాభాలు. అధిక దిగుబడివల్ల ఆదాయం. రొయ్యలు, చేపల చెరువులవారికి విశేషంగా లాభించును. రైతులకు మోటారు వాహనాలు సమకూరును. గృహంలో శుభకార్యములు చేయుదురు.

**స్త్రీలకు :-** ఈసం॥రం పట్టిందల్లా బంగారామా? అనునట్లుండును. ఆరోగ్యము కుదుటపడును. కుటుంబంలో మీప్రాముఖ్యత పెరుగును. నూతనఆభరణములు, స్థిరాస్తులు మీకు లభించును. ఉద్యోగాదులలో ఉన్నవారికి కుటుంబంలో సఖ్యత, అధికారులమన్ననలు పొంది ప్రమోషన్‌తోకూడిన బదిలీలు సంతానంతోసఖ్యత, గతంలోవిడిపోయినవారు ఈసంవత్సరం కలుసుకుంటారు. వివాహంకాని స్త్రీలకు ఈసం॥రం వివాహం జరుగును. గర్భిణీస్త్రీలకు ఫ్రీ డెలివరీ అయి పుత్ర సంతానం కలుగును. 12వఇంట రాహువువల్ల మాతృ,పితృవంశ పీడలు, సంతాన పీడలు.

మొత్తంమీద ఈ రాశివారందరికీ గురుబలంవల్ల చక్కనిజీవితం.గత కొద్దికాలంగాపడుచున్నబాధలుతొలగును. కానిరాహువు వల్ల కొంతమేర ఇబ్బంది.

**చేయవలసిన శాంతులు:-** ఈసం॥రం మంగళ,శనివారనియమాలు పాటించి మంగళవారం మీగ్రామంలోగల శివాలయంలో7వారాలురుద్రాభిషేకం చేయించిన మంచిది. శ్రీశైలక్షేత్రదర్శనం, జాగరణ చేయాలి. మీపై ఇతరులకు ఈర్ష్య అసూయ హెచ్చును. గాననరఘోష, రాహుగ్రహయంత్రాలు ధరించిన మంచిది. రూ. 1300/-లు అగును. సొమ్ము బుట్టే వీరభద్ర దైవజ్ఞ, తిలక్‌రోడ్, రాజమహేంద్రవరం - 533 103 అను అడ్రసుకు M.O. ద్వారా లేదా ఈ క్రింది ఫోన్ నెంబరుకు 90005 72660 Phonepe, Google pay, Paytm ద్వారా చెల్లించి, మీ వివరాలు లెటరు ద్వారా తెలపండి. మీపేరు, గోత్రంతో యంత్రాలు పూజించి 25 రోజులలో పోస్ట్‌ద్వారా పంపగలము.

**ఏప్రియల్ :-** ఈనెలలో మిశ్రమఫలదాయకం చేయువృత్తివ్యాపారములందు రాణింపుఉన్ననూ, ధనం మంచినీళ్ళ వలె ఖర్చుగును.ఒక్కోసారి ఋణాలు చేయవలసివచ్చును. అయినఅధైర్యపడరు. వ్యవహారాదులు అనుకూలించును. ఆరోగ్యం బాగుంటుంది. ఊహించని సంఘటనలు జరిగిననూ మనోనిబ్బరం చెక్కుచెదరదు.

**మే:-** ఈనెలలోగ్రహసంచారంఅంతఅనుకూలించదు. చేయువృత్తివ్యాపారాలందు ఆటంకాలు, శారీరకశ్రమ, అశాంతియు,బంధుమిత్రాదులతో కలహాలు, ఏమి మాట్లాడిన వ్యతిరేకత, ఆరోగ్యభంగాలు, వాహనప్రమాదాలు, సంతానంతో ఇబ్బందులు, భార్యాభర్తల మధ్య సరైన అవగాహనుండదు. సంఘంలో అపనిందలు.

**జూన్:-** చేయువృత్తివ్యాపారులకు అన్నిరంగాలవారికిబాగుంటుంది. ఆర్థిక సమస్యలు అంతగాబాధించవు. ఆరోగ్యం కుదుటపడును. స్నేహితుల సహాయ సహకారం వలన పనులు పూర్తి చేస్తారు. శుభకార్యములు కలిసివచ్చును. సంతానం వలన సౌఖ్యం, స్త్రీ సౌఖ్యం, యశోభూషణప్రాప్తి, అందరిలోనూ మీదే పైచేయి.

**జూలై:-** అన్నివిధాలుగా అందరికీ బాగుంటుంది. చేయు వృత్తివ్యాపారములందు రాణింపుఆదాయంబాగుండును. ఆరోగ్యలాభాలు. దూరప్రయాణాలు కలసివచ్చును. పుణ్యనదీస్నానాలు,మిత్రులతో కలసి విందులువినోదములు, సంఘంలో మంచి గుర్తింపు. సోదరమూలకలాభములు. ప్రభుత్వసంబంధ వ్యవహారములుపూర్తగును.

**ఆగష్టు:-** గ్రహాలన్నీఅనుకూల సంచారంవలన అన్నివిధములుగా బాగుంటుంది. పనులుత్వరితంగాపూర్తి. కోర్టువ్యవహారాలలోమీదేవిజయం. మనస్సు ప్రశాంతంగా ఉండును. ప్రతివిషయంలో మీ ఆధిక్యత కనిపించును. రానిబాకీలు వసూలగును. శత్రువులే మిత్రులగుదురు. కుటుంబసౌఖ్యం, వాహనమార్పులు తప్పక కలుగును.

**సెప్టెంబర్:-** ఈనెలలో మిశ్రమ ఫలితాలు. ఆదాయంనకు మించినఖర్చులు. ఊహించని సమస్యలు ఎదురగును. ప్రతిచిన్న విషయానికి చికాకు పడుదురు. ఉద్రేకంహెచ్చును. ఆరోగ్యభంగములు,కుటుంబచిక్కులు,విరోధాలు, కార్యాటంకములు, మానసికంగా కృంగిపోవుదురు. ప్రయాణములో ప్రమాదములు.

**అక్టోబర్:-** ఈనెలలోకూడా అంతఅనుకూలతఉండదు. పనులందు ప్రతిబంధకములు. శారీరకశ్రమ, అలసట, త్రిప్పుట,అకాలభోజనములు,శత్రుబాధలు, సమస్యలలోచిక్కుకొనుట, కుటుంబంలో నలతలు, సంతానంద్వారాఇబ్బందులు, దొంగలభయం, విలువైన వస్తువులు పోగొట్టుకుంటారు. ప్రభుత్వసంబంధ ఇబ్బందులు.

**నవంబర్:-** ధనంమంచినీళ్ళవలెఖర్చగును. ఋణములు చేయవలసి వచ్చును. పరిస్థితులు అనుకూలించవు. ప్రతీవ్యవహారంలోను నష్టములే. చిన్నవారి వలన అవమానాలు, ప్రభుత్వపరంగా చిక్కులు. మిత్రులువలన మోసపోవుట, సకాలంలో ధనం చేతికందదు. వాహన ప్రమాదములు. బంధుమిత్ర వైషమ్యములు, సంకట పరిస్థితులు. ఏమి మాట్లాడినా విరోధమే వచ్చును. నేత్ర, శిరోపీడలు తప్పవు.

**డిశంబర్:-** ఆరోగ్యంబాగుండదు. ధననష్టములు. శారీరక గాయాలు, చాలా ఉద్రేకముగా చికాకులతో ఉంటారు. ఇతరులు ఎంతశాంతంగా మాట్లాడినా మీరు అధికకోపంతో మాట్లాడుదురు. శస్త్రభయం,ఆందోళనకలిగించు సంఘటనలు జరుగును. సోదర వర్గము వారితో కలహములు తారాస్థాయికి చేరును.

**జనవరి:-** ఈనెలలో పరిస్థితులు కొంతమేర అనుకూలించును. కోపంమాత్రం తగ్గదు. చేయువృత్తివ్యాపారాలు రాణించును. వ్యవహారములు అనుకూలించును. ఆర్థికంగాబాగుంటుంది. దూరప్రయాణాలు, బంధుమిత్రులతో కలయిక, నూతన వస్తు,వస్త్రప్రాప్తి,ఉత్సాహం,గృహంలోసంతోషం, పాతమిత్రులను కలుసుకుంటారు.

**ఫిబ్రవరి:-** అన్నివిధాలుగా బాగుంటుంది. సంతోషంగా, ఆనందంగా, గృహంలో శుభకార్యాలు, గృహనిర్మాణాలు కలిసివచ్చును, స్థిరాస్థిలాభం, స్పెక్యులేషన్ అనుకూలత, లోగడనిలచినపనులుపూర్తి, ఉద్యోగులకు ఆనందమైనవార్తలు వింటారు. సంఘంలోఉన్నతస్థితి, మధ్యవర్తిత్వం లాభించును. సంతానసౌఖ్యం, స్త్రీ సౌఖ్యం.

**మార్చి:-** చేయువృత్తి,వ్యాపారాలుబాగాఅనుకూలించును. ఆరోగ్యంబాగుంటుంది. మిత్రుల సహాయసహకారములభించును. వాహన సౌఖ్యం, నూతన వాహనప్రాప్తి క్రొత్తవస్తువులుకొంటారు. భార్యతోసఖ్యత, ఆనందమైనజీవనం, సంతానంద్వారా లాభములు, నూతన పరిచయాలు ఫలించును. సంఘంలో మీపేరు ప్రఖ్యాతలు బాగా పెరుగును. విద్యార్థులు పరీక్షలు బాగా వ్రాయుదురు. కుటుంబ సౌఖ్యం.







# వృశ్చికరాశి ఫలితములు

## SCORPIO

**విశాఖ 4 పాదము అనూరాధ 1,2,3,4 పాదములు జ్యేష్ఠ 1,2,3,4 పాదములు**

**ఆదాయం - 2 వ్యయం - 14** | **రాజపూజ్యం - 5 అవమానం - 2**

### ఈ రాశి వారికి ఈ సంవత్సరములోగ్రహములదోషకాలములు

**రవి :** 15-6-2025 నుండి 16-7-2025 వరకు అష్టమం, 18-10-2025 నుండి 16-12-2025 వరకు ద్వాదశం, జన్మం, 13-2-2026 నుండి 14-3-2026 వరకు అర్ధాష్టమం **కుజుడు :** 12-9-2025 నుండి 6-12-2025 వరకు ద్వాదశం, జన్మం, 23-2-2026 నుండి సం॥రం ఆఖరు వరకు అర్ధాష్టమం **గురుడు :** 9-5-2025 నుండి అష్టమ గురుడు **శని :** 10-10-2025 నుండి 10-1-2026 వరకు అర్ధాష్టమం, **రాహువు :** 16-5-2025 నుండి అర్ధాష్టమం **కేతువు :** ఈ సం॥రం శుభుడే.

ఈరాశి స్త్రీ, పురుషులకు ధనకారకుడైన గురుడు 7,8 స్థానములందు, వాహనాధిపతి, భూ,గృహస్థానాధిపతి శని స్వక్షేత్ర స్థితి రాహువు, కేతువు స్థితులు బాగున్నందువలన యోగ్యమైన అన్నపానీయాలు, వాహనలాభం, విద్యాఖ్యాత, లోగడ రెండుసం॥రంలునుండి నిలబాటుగాటున్న పనులుపూర్తగుట, స్వశక్తిసామర్థ్యములచే పైకి రాగలుగుట, వ్యవహారజయం, జీవనలాభం మీలో గల చతురత్వంచే ఎంతటివారినైనా స్వాధీనం చేసుకొనుట, మాటలు నైపుణ్యము కలుగును. అధికార వర్గం మీకు అన్నివిధములుగా చేదోడువాదోడుగా ఉండును. దూరప్రయాణములు లాభించును. ఏవిధమైన సంకోచం చెందక నిర్భయంగా సంచరించి ముందుకు పోగలరు. స్వగృహనిర్మాణము సిరాస్థివృద్ధి, కోర్టులావాదేవీలు విజయవంతము. కుటుంబసభ్యులువలన మీ గాంభీర్యత పెరుగును. చెడు ప్రభావం మీపై అంతగా ఉండదు. కుటుంబకలతలు. భార్యాబిడ్డల మధ్య స్వల్ప ఈతిబాధలు వచ్చినా గృహములో శుభకార్యములు చేస్తారు. అప్రయత్న ధనలాభము, సంతానం యొక్క ప్రాముఖ్యతహెచ్చును. జీవితంలో స్థిరత్వం పొందగలరు. ఆడవారు మీతో ప్రేమగా ఉంటారు. శత్రుత్వములు అంతరించును. జీవనవిధానంలో మార్పులు కలుగును. కొన్నివిషయాలలోకొంత ఆందోళనకలిగించినా అంతగాబాధించదు. యోగకాలం.

ఈసం॥రం ఉద్యోగులకు అష్టమ గురు ప్రభావం అంతగా ఉండదు. ప్రమోషన్స్‌తోకూడిన బదిలీలు. కేంద్ర,రాష్ట్రప్రభుత్వ ఉద్యోగులకు బాగుంటుంది. కావలసినప్రదేశాలకు బదిలీలు. అధికారుల మన్ననలు గృహలాభాలు. కుటుంబసౌఖ్యం. ప్రవేటు కంపెనీలందు పని చేయువారికి జీతంతోపాటు హోదాలు పెరుగును. హోదాపెరుగుటచే మరొక కంపెనీకి మార్పుఉంటుంది. స్థానచలనములు లేదా గృహమార్పులుతప్పవు. పర్మినెంటుకానివారికి ఈసం॥రం పర్మినెంటుకాదు. నిరుద్యోగులకు ఈసం॥రం కొంత ఫర్వాలేదు. ఏదోఒక ఉద్యోగంలభించును.

రాజకీయ నాయకులకు ఈసం॥రం అంత అనుకూలత ఉండదు. గురుబలం లేదు. వ్యవహారాదులుఅనుకూలించవు. ప్రజలలో విశ్వాసం కోల్పోవుదురు. ఎన్నికలందు ఓటమిపాలగుదురు. అధిష్ఠానవర్గంవారు మన్ననలు పొందలేరు. ధనము మంచినీళ్ళవలె ఖర్చగును. అయినా ఫలితం దక్కదు. నామినేటడ్ లేదా పార్టీపదవి కూడాలభించుట కష్టమేఅగును. మీ అనవసర మాటలే మిమ్మల్ని దూరం చేస్తాయి.

**వివాహమునకు :-** వివాహమునకు విదియ,తదియ,పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులు,బుధ,గురు, శుక్రవారాలు, రోహిణి, మృగశిర, ఉత్తర, హస్త, స్వాతి,అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర,రేవతి,నక్షత్రాలు. వృషభ, మిధున ,కర్కాటక, తుల,కన్య, ధనుస్సు, మీన లగ్నాలు. వైశాఖ,జ్యేష్ఠ, కార్తీక,మార్గశిర, మాఘ,ఫాల్గుణమాసములుమంచివి. రవిమేషరాశిలో ఉండగా చైత్రమాసమునవివాహం చేయవచ్చును. సప్తమందు ఏగ్రహం కూడా ఉండరాదు. అష్టమశుద్ధి తప్పనిసరి.



**నవవధువు ప్రవేశము :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిధులు, బుధ,గురు, శుక్రవారాలు, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తరాషాఢ, హస్త,స్వాతి,చిత్ర, అనూరాధ, శ్రవణం,మఘ, మూల, పునర్వసు, జ్యేష్ఠ, ధనిష్ఠ రేవతి నక్షత్రాలు,వృషభ,మిధున, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనుస్సు, కుంభ, మీన లగ్నాలు మంచివి. వివాహం జరిగిన 16 రోజులలోపున తిధి, వార నక్షత్రాలను పాటించక గృహప్రవేశమును చేయించవచ్చును.

**గర్భాదానము (శోభనం) :-** విదియ,తదియ,పంచమి, సప్తమి,దశమి,త్రయోదశితిధులు,సోమ,బుధ,గురు, శుక్ర వారాలు,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,ఉత్తర,హస్త చిత్ర,స్వాతి,అనూరాధ,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్రనక్షత్రాలు,వృషభ,కర్కాటక,కన్య,తుల,ధనుస్సు, మీన లగ్నాలు, లగ్నశుద్ధి, అష్టమశుద్ధి, తప్పనిసరి, పంచపర్వ ములు, వ్రతదినాలు, సంధ్యాసమయం, శ్రాద్ధదినాలు పనికిరావు. వివాహం అయిన 16 రోజులలో చేసినయెడల ముహూర్తం అవసరం లేదు.



**పుంసవన, సీమంతము :-** విదియ, తదియ, పంచమి,సప్తమి, త్రయోదశి, పూర్ణిమ తిధులు, బుధ,గురు, శుక్రవారాలు,రోహిణి, పుష్యమి, హస్త,చిత్ర,స్వాతి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర,పునర్వసు, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ శతభిషం, రేవతినక్షత్రాలు.మేష,మిధున,తుల, ధనుస్సు,కుంభలగ్నాలు. పుంసవనమునకు 3వనెల, సీమంతమునకు 5,7,8,9 నెలలు మంచివి.

**స్త్రీలు ఆభరణములు,నూతనవస్త్రములు ధరించుటకు :-** అశ్విని,హస్త, చిత్ర,స్వాతి, విశాఖ,అనూరాధ,ధనిష్ఠ, రేవతి నక్షత్రములయందు బుధ,గురు, శుక్రవారములందు వెండి, బంగారు ఆభరణములు, నూతనవస్త్రములు ధరించుటకు మంచిది. సోమ,మంగళవారములందు సౌభాగ్యవతులైన స్త్రీలు ఆభరణములు,నూతనవస్త్రములు ధరించరాదు.

**గర్భిణీ స్త్రీ ధర్మములు :-** గర్భవతి అయిన స్త్రీలు యీ క్రింది నియమములు తప్పనిసరిగా పాటించవలెను. ముత్తైదువులను, బ్రాహ్మణులను పూజించాలి. ఇష్టదైవమును భగవన్నామమును నిత్యం పూజించాలి. శుభప్రదమైన ఆభరణ ములు ధరించాలి. 4,6,8,మాసములందుప్రయాణములు చేయరాదు. గర్భిణీస్త్రీ ఏవస్తువులనుకోరునో ఆవస్తువులను వెంటనే తెచ్చిఇవ్వవలెను. సముద్ర స్నానం,చెట్లునరుకుట, గృహారంభ, శంఖుస్థాపనలు చేయరాదు. మైలనుతాకరాదు, శోకించరాదు. సూర్యచంద్రగ్రహణములందు మాత్రం జాగ్రత్తగా ఉండేది. పరుండి మాత్రమే ఉండవలెను.





**మొదటి కాన్పుకు తీసుకొనివెళ్ళుటకు :-** విదియ, తదియ,పంచమి, సప్తమి, దశమి,త్రయోదశితిధులు,సోమ,బుధ,గురు,శనివారములందు శుభ నక్షత్రా లలో గర్భిణీస్త్రీకి తారాబలం సరిపోయే విధంగాచూసి, వారశూలలు చూచుకొని తీసుకొని వెళ్ళవలెను. కుటుంబ ఆచారముబట్టి తీసుకువెళ్ళాలి.

**బాలింతస్నానమునకు :-** ఆది,మంగళ,గురువారాలు మంచివి. అశ్విని,రోహిణి, మృగశిర,ఉత్తర, హస్త, స్వాతి,అనూరాధ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలుమంచివి. 11వరోజున స్నానంచేయించాలి.



**శిశువును ఊయలలో వేయుటకు :-** విదియ, తదియ, పంచమి,సప్తమి,దశమి,త్రయోదశితిధులు,సోమ,బుధ, గురు,శుక్రవారాలు,అశ్విని,రోహిణి,మృగశిర,పునర్వసు, పుష్యమి,ఉత్తర,హస్త,చిత్ర,అనూరాధ,ఉత్తరాషాఢ,ఉత్తరా భాద్ర, రేవతి నక్షత్రాలు.వృషభ,మిధున, కర్కాటక, కన్య, తుల,ధనుస్సు,మీనలగ్నాలు.అష్టమశుద్ధితప్పకచూడవలెను.

**శిశువునకుమొలత్రాడు కట్టుటకు :-** శిశువునకు వెండి లేదా బంగారపు మొలత్రాడును పురిటిశుద్ధిరోజున లేదా5వనెలయందు కట్టవలెను. మొల త్రాడునకు నల్లపూసలు, రాగికాణి, శిశువు యొక్క పురిటిసమయమందు తీసిన బొడ్డుగానీ కట్టినా గాలి, ధూళి, దిష్టి దోషాలు తొలగును.

**బిడ్డను ఇల్లుకదుపుటకు :-** విదియ, తదియ,పంచమి,సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులు,అశ్విని,రోహిణి, మృగశిర,పునర్వసు, పుష్యమి, ఉత్తర,హస్త చిత్ర, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ,శతభిషం, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, రేవతి నక్షత్రాలు, మేష,వృషభ,కర్కాటక,తుల, ధనుస్సు,మీన లగ్నాలు, సోమ, బుధ, గురు,శుక్రవారాలు మంచివి. శిశువు పుట్టిన 3వనెలలో ముందుగా దేవాలయ మునకు తీసుకొనివెళ్ళి ఆ తర్వాత మేనమామగారి ఇంటికి తీసుకొని వెళ్ళాలి.

**పురుడు తరువాత శిశువుతో అత్తవారింటికి వెళ్ళుట :-** శిశువుకు 3వ నెలగాని, 5వనెలగాని ఆపై 7,9,11నెలల్లోగాని అత్తవారింటికి వెళ్ళవచ్చును. వర్తమానంలో కొంతమంది నెలలోనే పంపించు చున్నారు. అట్లుచేయుటవలనస్త్రీయొక్క ఆరోగ్యంక్షీణించును. విదియ,తదియ,చవితి,సప్తమి,దశమి,ఏకాదశి,త్రయోదశి,తిధులు. సోమ,బుధ, గురు,శనివారములు, అశ్విని,రోహిణి,మృగశిర, పునర్వసు,పుష్యమి,మఘ,ఉత్తర,హస్త,స్వాతి,అనూరాధ,మూల, ఉత్తరాషాఢ,శ్రవణం,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రములందు తారాబలం, వారశూల,ఆనందాదియోగములు తప్పకచూడాలి. తారాబలంమాత్రం తల్లికి, శిశువుకుఇద్దరికూసరిపోవాలి.గురు,శుక్ర మౌఢ్యమిలందు కూడా తీసుకురావచ్చును.



**నామకరణం :-** నామకరణం అనగా బిడ్డకుపేరుపెట్టుట. ఈ కార్యక్రమమును పురిటి శుద్ధి అనంతరం బారసాల రోజున అనగా 11,21 29రోజులలోగాని 3వ నెలలో గాని పేరు పెట్టాలి. శుభనక్షత్రాలు, శుభతిధులు చూచుకోవాలి.

**కేశఖండనము (పుట్టు వెంట్రుకలు) :-** కేశఖండన విషయంలో తరతరాలు గావస్తున్న ఆచారం, సాంప్రదాయాలను చూడవలెను. ఎవరికి ఏ దేవాలయం

అయితే వారుఅక్కడే కేశఖండన కార్యక్రమాన్ని ఆనవాయితీగా నిర్వహించాలి. కొందరు తిరుపతిలోనూ, మరికొందరు అన్నవరం క్షేత్రాలలోనూ కొందరు విజయవాడ దుర్గగుడి వద్దనూ చేస్తుంటారు. దీనినిముఖ్యంగా విదియ,తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిధులు, సోమ,బుధ, గురువారాలు, అశ్విని, మృగశిర, పునర్వసు,పుష్యమి, హస్త, చిత్ర, స్వాతి, శ్రవణం, ధనిష్ఠ శతభిషం, రేవతి, నక్షత్రాలు. వృషభ,మిధున,కర్కాటక, కన్య, ధనుస్సు మీనలగ్నాలు, గురుబలం, అష్టమశుద్ధి తప్పనిసరి 6,7,8,10నెలలో జరిపించాలి.



**అన్నప్రాశనం :-** విదియ,తదియ,పంచమి,సప్తమి, దశమి, ఏకాదశి,త్రయోదశి, తిధులు,సోమ,బుధ,గురు, శుక్రవారాలు, అశ్విని,రోహిణి, మృగశిర, పునర్వసు,పుష్యమి,ఉత్తర,హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రాలు, వృషభ,మిధున ,కన్య కర్కాటక, ధనుస్సు, మీన లగ్నాలలో అన్నప్రాశన జరిపించినా అన్నివిధాలుగా ఆరోగ్యంగా జీర్ణశక్తి కలిగి ఉంటారు. లగ్నశుద్ధి దశమశుద్ధి కావలెను. పురుషులకు సరినెల, స్త్రీలకు బేసినెల చూడాలి.

**చెవులు కుట్టుటకు (కర్ణవేధన) :-** విదియ, తదియ,పంచమి,సప్తమి, దశమి, త్రయోదశితిధులు.సోమ,బుధ,గురు,శుక్రవారాలు,అశ్విని,మృగశిర, పునర్వసు, పుష్యమి,ఉత్తర,హస్త,చిత్ర,అనూరాధ,ఉత్తరాషాఢ, శ్రవణం,ధనిష్ఠ,ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు,వృషభ,మిధున,కర్కాటక, కన్య, ధనుస్సు, మీనలగ్నములు అష్టమశుద్ధి, గురుబలం ఉండాలి. 6,7,8 నెలల్లో జరిపించాలి.

**ముక్కుకుట్టుటకు :-** శుభలగ్నాలలోను,శుభనక్షత్రాలలోను, శుభతిధులను చూచుకొని ముక్కుకుట్టుట కార్యక్రమం నిర్వహించాలి.

**ఉపనయనము :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి,తిధులు, కృష్ణపక్షమున విదియ,తదియతిధులు,బుధ,గురు,శుక్ర వారాలు,అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం,ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర,రేవతి నక్షత్రాలు, వృషభ,మిధున, కర్కాటక, కన్య, ధనుస్సు, మీనలగ్నాలు, అష్టమశుద్ధి చూడాలి. మీనచైత్రం దీనికిమంచిది. గ్రహబలంచాలాముఖ్యం తల్లిదండ్రులకు తారాబలం చూడాలి. కేంద్రమునందు పాపగ్రహములుండరాదు.

**యజ్ఞోపవీతధారణ (జంధ్యము వేసుకొనుట) :-** శ్రావణ పౌర్ణమికి, గ్రహణం విడిచినతరువాత, జ్ఞాతులుమరణించిన మైలశుద్ధి, పురిటిమైలశుద్ధి అయిన వెంటనే క్రొత్త జంధ్యము ధరించాలి.

**దత్తతస్వీకారం :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమితిధులు,శుక్లపక్షాన ఏకాదశి,త్రయోదశితిధులుశుభం.బుధ, గురు,శుక్రవారాలు శుభం. రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త స్వాతి, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలుమంచివి. లగ్నాలలో శుభగ్రహాలు ఉండాలి. లగ్నశుద్ధి, లగ్నానికి శుభగ్రహవీక్షణ ఉండాలి. పంచమంలోపావ గ్రహాలుగాని వీరి దృష్టులు గానిఉండరాదు.









# వ్యాపార సంబంధ
## శుభముహూర్త విషయములు



**బట్టల దుకాణములుప్రారంభించుటకు :-** అశ్విని,రోహిణి,పునర్వసు,ఉత్తర, హస్త, చిత్ర,స్వాతి,అనూరాధ,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ, శతభిషం,ఉత్తరాభాద్ర, రేవతినక్షత్ర ములు,విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి,ఏకాదశి,త్రయోదశి తిధులునూ, సోమ,బుధ,గురు, శుక్రవారములు మంచివి.



**బంగారు,వెండి నగల వ్యాపారమునకు :-** విదియ,తదియ, పంచమి, సప్తమి,దశమి,ఏకాదశి,తిధులు,అశ్విని,రోహిణి, పునర్వసు, పుష్యమి,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ,ఉత్తరాషాఢ ,శ్రవణం, ధనిష్ఠ,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రములు, సోమ, బుధ, గురు, శుక్రవారములందు లాభదాయకం.

**కిరాణా దుకాణము :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి తిధులందునూ, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర, రేవతినక్షత్రములందును అది, సోమ, బుధ, గురు, శుక్రవారములందు లాభదాయకము.

**ఇనుము,స్టీలు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి,ఏకాదశి,త్రయోదశి తిధులు శుక్లపక్షచతుర్దశిమంచిది.శని,సోమ,బుధవారములు,అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, అనూరాధ, స్వాతి, ఉత్తరాభాద్రనక్షత్రములు మంచివి.



**ఎలక్ట్రికల్ షాపులు :-** విదియ,తదియ,పంచమి, సప్తమి,దశమి, పూర్ణిమతిధులందునూ,మంగళ,బుధ,శుక్రవారములందునూ,రోహిణి, మృగశిర,పుష్యమి,హస్త,అనూరాధ,ఉత్తరాభాద్రలుమంచివి.

**ఫ్యాన్సీ షాపులు :-** విదియ,తదియ,పంచమి,సప్తమితిధులందునూ,సోమ,బుధ, గురు, శుక్రవారాలు,రోహిణి,మృగశిర,పుష్యమి,హస్త,చిత్ర,శ్రవణం,ధనిష్ఠ నక్షత్రాలుమంచివి.

**మందులషాపులు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి,ఏకాదశి తిధులు, ఆది,మంగళ,బుధవారములు,రోహిణి,మృగశిర,ఉత్తర,చిత్ర,స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ నక్షత్రములు మంచివి.



**పండ్లు దుకాణములు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి, ఏకాదశి,త్రయోదశితిధులందునూ,సోమ,బుధ,గురు,శుక్రవారములు, రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు లాభదాయకము.

**స్టేషనరీ దుకాణములు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమితిధులందునూ,సోమ,బుధ,గురు,శుక్రవారాలు,రోహిణి,మృగశిర,హస్తస్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ,శ్రవణం,ఉత్తరాభాద్రనక్షత్రములందుప్రారంభించిన ధనలాభములు కలుగును.

**రేడియో,టి.వి.,వాచ్‌దుకాణములు :-** పంచమి,సప్తమి,దశమి,తిధులందునూ, సోమ,బుధ,గురు,శుక్రశనివారములందునూ,రోహిణి,మృగశిర,హస్త,చిత్ర,స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ,శ్రవణం,ఉత్తరాభాద్ర నక్షత్రములు శుభములు.

**గృహాఫర్నిచర్ దుకాణములు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి, దశమి, ఏకాదశి,త్రయోదశితిధులందునూ,సోమ,బుధ,గురు,శుక్రవారములు,రోహిణి,

మృగశిర,పుష్యమి,ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ,ఉత్తరాషాఢ,శ్రవణం,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతులు,లగ్నబలంకూడావుంటేలాభదాయకంగానుండును.

**రైసుమిల్లులు ప్రారంభించుటకు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి, దశమి, ఏకాదశితిధులందునూ,సోమ,బుధ,గురు, శుక్రవారములందునూ, అశ్విని, రోహిణి, మృగశిర,పునర్వసు,పుష్యమి,ఉత్తర,చిత్ర,స్వాతి,అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రములందునూ,స్థిరలగ్నములందునూ,చతుర్థ,అష్టమ శుద్ధులుకావలెను.

**సినిమా, ఫిలిండిస్ట్రిబ్యూషన్ వ్యాపారమునకు :-** సోమ, బుధ, గురు, శుక్ర వారములు,విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి,ఏకాదశి,త్రయోదశి, పూర్ణిమ తిధులందునూ, అశ్విని, రోహిణి, మృగశిర,పునర్వసు, పుష్యమి, ఉత్తర, స్వాతి, అనూరాధ,ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రములందునూ సప్తమశుద్ధి, శుక్రుడు బలీయముగా నున్నయెడల ఈ వ్యాపారమందు అధికలాభములు.

**సైకిల్, మోటారు సైకిళ్ళ వ్యాపారమునకు :-** విదియ, తదియ,పంచమి,సప్తమి,దశమితిధులు,మంగళ,బుధ, గురు, శుక్రవారములందునూ,అశ్విని,రోహిణి,మృగశిర, పునర్వసు, పుష్యమి,స్వాతి,అనూరాధ,ఉత్తరాభాద్ర,రేవతీ,నక్షత్రాలందునూ స్థిరలగ్నములు, మేష, వృశ్చికము కూడాబలీయమైనవి.



**హోటల్ వ్యాపారమునకు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమితిధులు, సోమ,బుధ,గురు,శుక్రవారములందు,అశ్విని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి, మఘ,ఉత్తర,హస్త,స్వాతి,అనూరాధ,మూల,ఉత్తరాషాఢ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం, ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రాలందు,శుభలగ్నములందుచేసిన లాభదాయకము.

**చిట్ ఫండ్ వ్యాపారమునకు :-** తదియ,పంచమి, సప్తమి, దశమి,ఏకాదశితిధులు,బుధ,గురువారములందు,అశ్విని, రోహిణి,మృగశిర,ఉత్తర,స్వాతి,అనూరాధ,ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రములందునూ,వృషభ, మిధున, కర్కాటక,తుల,ధనుస్సు,మీనలగ్నములు,సప్తమందు బలీయ మైనశుభగ్రహం ఉండుట చాలామంచిది.



**పుష్పముల దుకాణము :-** సోమ,గురు,శుక్రవారాలు ,రోహిణి,మృగశిర,పుష్యమి, హస్త,చిత్ర,స్వాతి,ఉత్తరాషాఢ,శ్రవణం,శతభిషం,ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రాలుమంచివి.

**ఫైనాన్స్ వ్యాపారమునకు :-** అష్టమశుద్ధితో కూడిన లగ్నమందునూ, స్వాతి, పునర్వసు,పుష్యమి,ధనిష్ఠ,శ్రవణం,శతభిషంనక్షత్రములందునూ, చరలగ్నము లందునూ5,9 స్థానములందు శుభులుండగా అప్పులుయిచ్చేది. మంగళవారం, సంక్రమణదినమందు, హస్తతోకూడిన ఆదివారం అప్పుతీసుకోకూడదు.

**లిక్కర్ల వ్యాపారమునకు :-** మత్తుపానీయములు, లిక్కర్ల వ్యాపార మునకు మేష,వృషభ,కర్కాటక, తుల,ధనుస్సు,మకర, కుంభ, మీన లగ్నములందునూ, మంగళ,శనిఆదివారములందునూ ,విదియ, తదియ,పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, పూర్ణిమ తిధులందునూభరణి,ఆరుద్ర, ఆశ్లేష,మఘ,పుబ్బ, జ్యేష్ఠ, మూల ,పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర నక్షత్రములందు మంచిది.







# గృహ సంబంధ వస్తువులు

## ఉపయోగించుటకు శుభముహూర్త విషయములు

**బంగారం, వెండి,స్టీలు, పాత్రలందు భుజించుటకు :-** బుధ, గురు, శుక్రవారములందునూ, అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ, ఉత్తర,ఉత్తరాషాఢ,ఉత్తరాభాద్ర,రేవతినక్షత్రములందునూ, అమృతయోగమునందునూ,బంగారం,వెండి,స్టీలు, పాత్ర లందు భోజనంచేయుటకు మంచిది.



**క్రొత్తచెప్పులు ధరించుటకు :-** బుధ, శని, ఆదివారములందునూ, కృత్తిక, ఆరుద్ర, మృగశిర, మఘ, పుబ్బ, ఆశ్లేష, చిత్ర, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రేవతి, నక్షత్రములందునూ చెప్పులదుకాణం ప్రారంభించుటకు, క్రొత్తచెప్పులు కొనుటకు, ధరించుటకు,చర్మంతో తయారుచేసే పనులు ప్రారంభించుటకు మంచిది.

**కార్లు,సైకిళ్ళు,లారీలు మొదలగుక్రొత్తవాహనములు ఉపయోగించుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, శుద్ధఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిధులందునూ, సోమ,బుధ, గురు, శుక్రవారములందునూ, అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త,చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ,జ్యేష్ఠ, శ్రవణ నక్షత్రములందునూ, వృషభ,మిధున, కర్కాటక,కన్య, తుల, మీన లగ్నములు, అష్టమ శుద్ధిపగటి భాగమునందు మంచిది. రాత్రియందు కూడదు.



**మంచమునకు నవ్వారు నులక వేయుటకు :-**ఆదివారం-లాభము, సోమ వారం-సుఖదాయకము,మంగళవారం-సంతానసౌఖ్యం,బుధవారం-రోగభయం, గురువారం-ధనప్రాప్తికుటుంబసౌఖ్యం,శుక్రవారం-లక్ష్మీప్రాప్తి సుఖం,శనివారం-రోగ పీడలు, మృత్యుభయము,కలుగును.

**కుర్చీలు, మంచము,టేబిల్స్‌వాడుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులందునూ, బుధ,గురువారములందునూ, అశ్విని,రోహిణి, మృగశిర, పునర్వసు,పుష్యమి,హస్త,చిత్ర,ఉత్తర,స్వాతి,శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు చాలా మంచిది.



**గ్యాస్ స్టౌవ్, ఫ్రిజ్, మిక్సీ గ్రైండర్, యిత్యాది వస్తువులు వాడుటకు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి, ఏకాదశి,త్రయోదశి తిధులందునూ, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివారము లందునూ, కుజహోరలో, వర్జ్యం ,దుర్ము హూర్తములేకుండా ఉపయోగించినయెడల ఆ వస్తువుత్వరగా పాడవదు.





# వ్యవసాయ సంబంధ
## శుభముహూర్తములు



**క్రొత్తగాభూమిసాగుచేయుటకు:-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి, ఏకాదశి,త్రయోదశి,పూర్ణిమతిధులందునూ,ఆది,మంగళ,బుధ,శుక్రవారా లందునూ,అశ్విని, రోహిణి, మృగశిర, మఘ, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు భూమిని క్రొత్తగాసాగు చేయుటకు మంచిది.

**ఏరువాక,దుక్కిదున్నుటకు :-** ఆది, మంగళ, గురువారాలందునూ, అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి,మఘ,హస్త, చిత్ర, విశాఖ, అనూరాధ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందునూ, వృషభ, మిధున, కన్య, ధనుస్సు, మీన లగ్నము లందునూదుక్కిదున్నుట ప్రారంభించుటకు మంచిది. మేషలగ్నమునందు పశునష్టము, కర్కాటకమునందు అధికవర్షముల వలన పంటనాశనము, సింహ లగ్నమునందు క్రిమికీటకాదుల భయం, తులయందు ప్రాణభయం, మకరమునందు పంటనాశనము, కుంభమునంచు దొంగలభయము.

**విత్తనములు చల్లుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులందునూ, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందునూ విత్తనములు చల్లినబాగుగా మొలకెత్తును. యింకనూ ఏ రంగుగల విత్తనములు ఆరంగుగల గ్రహవారాలందు చల్లిన శుభం కల్గును. ఉదాహరణకు తెల్లవిత్తనములు సోమవారం చల్లవలెను. అదేవిధంగా చూచేది.

**పొలిపెట్టుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులందునూ, ఆది, గురు, శుక్రవారాలందునూ, అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, మఘ, హస్త చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతినక్షత్రాలందు మంచిది.

**వరిఆకు ఊడ్చుటకు :-** చవితి, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి తిధులందు సోమ,బుధ, గురు, శుక్రవారములందునూ, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ ఉత్తరాభాద్ర, రేవతినక్షత్రాలందుచాలామంచిది.

**పంటకుప్ప వేయుటకు,నూర్చుటకు :-** తదియ, పంచమి, సప్తమి ,దశమి, ఏకాదశి, పూర్ణిమతిధులు, బుధ, గురు, శుక్రవారములు, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు కుప్పనూర్చిన మంచిది.





**ధాన్యం పొలం నుండిఇంటికి తెచ్చుటకు :-** ఇంటియజమాని తారాబలం, చంద్రబలం చూసుకొని వర్జ్య, దుర్ముహూర్తము లేకుండా, శుభగ్రహ హోరలలో క్రొత్త ధాన్యములు ఇంటికి తెచ్చుకోవలెను.

**ప్రత్తి,పొగాకుతోటలువేయుటకు :-** అశ్విని, భరణి, మృగశిర, పుష్యమి, ఆరుద్ర, హస్త, స్వాతి, రేవతి నక్షత్రాలందునూ, ఆది, బుధ, గురు, శుక్ర వారాలు, ఆ సంవత్సరం సస్యాధిపతిఅయినవారమునందు వేయుట మంచిది. ఈ విధంగావిత్తనాలు వేయుటవల్ల పంటలుబాగాపండి, అధిక దిగుబడులు వచ్చును. క్రిమికీటకాలబాధలుకూడాతగ్గి పంటబాగాపండి చేతికివచ్చును.

**కొబ్బరి,అరటి,మామిడి,తోటలువేయుటకు :-** తదియ, పంచమి, నవమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ, తిధులు, బుధ, గురు, శుక్రవారాలు, అశ్విని, మృగశిర, పుష్యమి, మఘ, అనూరాధ, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు శుభం.

**వరి, మొక్కజొన్న, వేరుశనగ, ప్రొద్దుతిరుగు పంటలు వేయుటకు :-** విదియ, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిధులు, ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారాలు. అశ్విని, భరణి, రోహిణి, ఆరుద్ర, పుష్యమి, హస్త, స్వాతి, మఘ, అనూరాధ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్ర ములందు మేష, వృషభ, కర్కాటక, తుల, ధనుస్సు, మీన లగ్నాలు మంచివి.

**చెరుకు,గోధుమ,ఆయిల్‌ఫామ్, తమలపాకు, తోటలు వేయుటకు :-** ఆది, మంగళ, గురు, శుక్ర, శనివారాలు, మేష, వృషభ, కర్కాటక; తుల, ధనుస్సు, మకర, మీన లగ్నములు, అశ్విని, మఘ, మూల, భరణి, పుబ్బ, పూర్వాషాఢ, కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాలు, శుభప్రదం.

**మిరప,పసుపు,అల్లం,ఉల్లి,వెల్లుల్లి పంటలు వేయుటకు :-** ఆది, మంగళ, బుధ, గురు, శనివారాలు, మేష, మిధున, కర్కాటక, కన్య, వృశ్చిక, మకర, కుంభలగ్నాలు, అశ్విని, మఘ, మూల, రోహిణి, హస్త, శ్రవణం, పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర, మృగశిర, చిత్ర, ధనిష్ఠ, నక్షత్రాలు మిక్కిలిమంచిది.

**కూరగాయల పంటలు వేయుటకు :-** అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, ఉత్తర శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, మఘ, మూల, పుబ్బ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢనక్షత్రాలు, వృషభం, కర్కాటక, సింహం, తుల, వృశ్చిక, ధనుస్సు, కుంభలగ్నాలు, బుధ, గురు, శుక్రవారాలు, మిక్కిలిశుభఫలాల్నిఇస్తాయి.

**పండ్లతోటలు వేయుటకు :-** బుధ,గురు, శుక్ర శని, ఆదివారాలు శుభ తిధులు. అశ్విని, భరణి,రోహిణి, ఆరుద్ర, పునర్వసు, అశ్రేష, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలలో మొక్కలు వేసిన పంటలు బాగాపండి రైతులకు మంచిధనాదాయం కలుగును.

**చెరువులో చేప,రొయ్య విత్తనం (సీడ్) వేయుటకు :-** విదియ, తదియ, చవితి, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ తిధులు, మేష, వృషభ, మిధున, కర్కాటక, తుల, ధనుస్సు, మీనలగ్నములు, అశ్విని, భరణి, రోహిణి, మృగశిర, పునర్వసు, ఆశ్రేష, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములలో రొయ్య, చేపవిత్తనం వేసిన మంచి దిగుబడివచ్చి అధికలాభాలుపొందుతారు.



# విద్యా సంబంధ శుభముహూర్తములు

**అక్షరాభ్యాసం :-** విదియ,తదియ,పంచమి,సప్తమి, దశమి, ఏకాదశి,త్రయోదశి తిధులు,అశ్విని,మృగశిర,పునర్వసు,పుష్యమి,ఆరుద్ర,హస్త,చిత్ర,స్వాతి, శ్రవణం,రేవతినక్షత్రములు,ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు మేష కర్కాటక, తుల, మకర, మీనలగ్నాలుశుభం.ఉత్తరాయణంలో5వసం॥రలో చేయాలి. అష్టమశుద్ధి తప్పనిసరి గురుశుక్రమూఢములలో చేయరాదు.

**గణితశాస్త్ర, కంప్యూటర్ విద్యలకు :-** రోహిణి,ఆరుద్ర,పుష్యమి,హస్త అనూరాధ,శతభిషం,పూర్వాభాద్ర,రేవతినక్షత్రాలు,బుధ,గురు వారాలుమిక్కిలిమంచివి.ఈశుభఘడియలలోగణిత, కంప్యూటర్ విద్యనుఅభ్యసించినఅన్నివిధాలుగా యోగిస్తుంది.



**వ్యాకరణం నేర్చుకోవడానికి :-** విదియ,తదియ,పంచమి,సప్తమి, దశమి, తిధులు,అశ్విని,రోహిణి,మృగశిర,ఆరుద్ర,పునర్వసు,పుష్యమి,హస్త,చిత్ర,స్వాతి, విశాఖ,అనూరాధ నక్షత్రాలు సోమ,బుధ,గురు,శుక్రవారాలు శుభం.



**వైద్య విద్యలకు :-** విదియ, పంచమి, దశమితిధులు, భరణి, కృత్తిక, రోహిణి, మఘ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, విశాఖ, నక్షత్రాలుమంచివి కావు. మిగిలిన నక్షత్రాలు శుభప్రదం, ఆది, సోమ, మంగళ వారాలు మంచివి.

**వేదవిద్యలకు :-** విదియ,తదియ,పంచమి,దశమి,ఏకాదశి,త్రయోదశి, పూర్ణిమ తిధులు,ఈతిధులకుఅశ్విని,రోహిణి,ఆరుద్ర,పునర్వసు,పుష్యమి,ఉత్తర, హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ,మూల,శ్రవణం,ఉత్తరాషాఢ,ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు ఉన్నపుడు, ద్విస్వభావరాశుల లగ్నం అయినా మిక్కిలిశుభకరం.

**భాషా విద్యాభ్యాసాలకు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి, తిధులు, ఆది,మంగళ,శనివారాలు,భరణి,కృత్తిక,ఆరుద్ర,మఘ,పుబ్బ,విశాఖ,జ్యేష్ఠ పూర్వాషాఢ,ఉత్తరాషాఢ,శతభిషం,పూర్వాభాద్ర,రేవతినక్షత్రాలు మంచివి.

**న్యాయశాస్త్ర అభ్యాసాలకు :-** అశ్విని,రోహిణి, పునర్వసు,పుష్యమి,స్వాతి, శ్రవణం,హస్తశతభిషం నక్షత్రాలు,సోమ,మంగళ,బుధవారాలుమంచివి.

**ధర్మ శాస్త్ర, ఆర్షశాస్త్ర పురాణాదివిద్యలకు :-** అశ్విని,మృగశిర, పుష్యమి,హస్త, చిత్ర, స్వాతి,విశాఖ,అనూరాధ,ధనిష్ఠ శతభిషం,రేవతినక్షత్రాలు మంచివి.

**సంగీతం,నాట్యములకు :-** సోమ,బుధ,గురు,శుక్రవారాలు,ఉత్తర,ఉత్తరాషాఢ,ఉత్తరాభాద్ర,అనూరాధ,పుష్యమి,హస్త,జ్యేష్ఠ,శతభిషం,ఆరుద్ర,ధనిష్ఠ,రేవతి నక్షత్రాలు మంచివి.

**తబలా,వీణ,మొదలగు వాయిద్యాలకు :-** అశ్విని,మృగశిర,పునర్వసు,పుష్యమి, హస్త,చిత్ర,స్వాతి,అనూరాధ,శ్రవణం,ధనిష్ఠ,శతభిషం,రేవతినక్షత్రాలు,బుధ, గురు,శుక్రవారాలు,పంచమి,దశమి,ఏకాదశి,త్రయోదశి,పూర్ణిమతిధులుమంచివి.

**చిత్రలేఖనమునకు :-** ఆది,సోమ,మంగళ,శుక్రవారాలు,విదియ,పంచమి,సప్తమి, ఏకాదశి,తిధులు,అశ్విని,భరణి,రోహిణి,మృగశిర,పునర్వసు,మఘ,పుబ్బ, ఉత్తర,హస్త,చిత్ర,స్వాతి,ఉత్తరాషాఢ,శ్రవణం,పూర్వాభాద్ర,రేవతినక్షత్రాలుశుభం.







# పశు సంబంధ శుభవిషయములు

**పశువులశాల వేయుటకు :-** విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి, ఏకాదశి,త్రయోదశితిధులు,అశ్విని,మృగశిర,పుష్యమి,హస్త,మూల, పూర్వాభాద్ర నక్షత్రములు,సోమ,బుధ,గురు,శుక్రవారములు,పశువులశాలవేయుటకుమంచిది. పుష్యమి నక్షత్రమున గురువారం కలసిన రోజున వృషభలగ్న,వృషభనవాంశ యందుపశువులదొడ్డివేసిన మృగ,చోరభయము కలుగక క్షేమంగాయుండును.

**పశువులను కొనుటకు :-** ఆది,గురు,శుక్రవారములందు,అశ్విని,మృగశిర, పుష్యమి,పుబ్బ,మూల,రేవతినక్షత్రములందునూమంచిది.

**పశువులను క్రొత్తగా తెచ్చుటకు :-** భరణి,కృత్తిక,ఆరుద్ర,అనూరాధ, మఘ, మృగశిర,పునర్వసు,స్వాతి,చిత్ర,మూలనక్షత్రములందునూ,ఆది,మంగళ, శని వారములందు తెచ్చుటకుశుభప్రదముగానుండును.

**పశువులను అమ్ముటకు :-** సోమ,బుధ,గురువారాలందును,అశ్విని, మృగశిర, ఆశ్లేష,మఘ,హస్త,విశాఖ,జ్యేష్ఠ,పూర్వాషాఢ,ధనిష్ఠ,పూర్వాభాద్రనక్షత్రాలందుమంచిది.

**పశువులనుబంధమువేయుటకు :-** ఆది,గురు,శుక్రవారములందు,అశ్విని, మృగశిర,పుష్యమి,పుబ్బ, మూల, రేవతి నక్షత్రములందునూ మంచిది.

**పశువులనుపశువులశాలలోకట్టుటకు :-** అశ్విని, మృగశిర, పుష్యమి, హస్త, మూల,పూర్వాభాద్ర,నక్షత్రాలందుక్రొత్తగాపశువులనుకట్టిన పశువృద్ధికలుగును.

**దూడలను దుక్కికిమప్పుటకు :-** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులందునూ, అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఘ, ఉత్తర, హస్త, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి నక్షత్రములందు, ఆది, సోమ, గురు, శుక్రవారములందు మంచిది,

**క్రొత్తగా పశువులనుకాడిపూన్చుటకు :-** అశ్విని,భరణి,రోహిణి,పునర్వసు, హస్త,విశాఖ,జ్యేష్ఠ,శతభిషం,రేవతినక్షత్రాలు, ఆది,గురువారములందుమంచిది.

**పోతులను పూన్చుటకు :-** చవితి,అష్టమి,నవమి,చతుర్దశి,అమావాస్య తిధులందునూ,భరణి,రోహిణి,చిత్ర,ఉత్తర,ఉత్తరాషాఢ,శ్రవణం,ఉత్తరాభాద్ర నక్షత్రములందు, శని, ఆదివారములందునూ పూన్చుటకు మంచిది.

## గృహప్రవేశవిషయమై చక్రశుద్ధి (అభిజిత్తుతో సహా)

| వృషభ చక్రం : రవి ఉన్న నక్షత్రం లగాయతు | | కళశచక్రం : రవి ఉన్న నక్షత్రం లగాయతు | |
|---|---|---|---|
| 3 మృత్యువు | 18 ధనం | 1 శిరచ్ఛేదం | 17 నిర్ధనం |
| 7 దుర్భిక్ష | 22 ధాన్యం | 5 ప్రవాసం | 21 గర్భస్రావం |
| 11 ధైర్యం | 25 సంపద | 9 అభయం | 24 లక్ష్మీప్రాప్తి |
| 14 భ్రమణం | 28 పశువృద్ధి | 13 ధాన్యం | 27 ఆయుష్యం |

FORM - 10



# పుట్టుమచ్చలు వాటి ఫలితములు

## వేదవారిని ధనవంతులను చేయగల పుట్టుమచ్చలు

ఈ క్రిందిస్థానములలో పుట్టుమచ్చలు ఉన్న యెడల ధనం సంపాదించుటలోమంచిసామర్థ్యము, శక్తియుక్తులు కలిగియుందురు. బాల్యములో తక్కువదశలో ఉన్న క్రమేపి ధనవంతులు కాగలరు. ఆకస్మికంగా ధనలాభములు కలిగి లక్షాధికారులు అగుదురు. జీవితములో సకలభోగభాగ్యములను సుఖములను అనుభవింతురు.

1. కుడికణతపై 2. ఎడమకణతపై 3. కుడికనుబొమ్మమీద 4. కుడికంటిలోనల్లగ్రుడ్డుకుఎడమభాగమున, 5.కుడికన్ను రెప్పలోపలి భాగమున, 6. నుదరు కుడి భాగమున, 7. ముక్కుకి కుడి వైపున, 8. గడ్డమునకుమధ్యభాగమున, 9.పెదవిక్రింద, 10. గడ్డమునకు కుడిభాగమున, 11.కంఠమునకు యిరువైపులను, 12. రొమ్మునకు కుడిభాగమున 13. కుడి అరచెయ్యి, 14.చిటికెనవ్రేలు క్రింద, 15.మణికట్టునకు ఇరువైపుల ఏభాగమునందైనా 16. కుడితొడమీద ఉన్నయెడల స్త్రీ ధనమును తన తెలివితేటలతో అభివృద్ధిపరచును. 17. కుడివృషణాల మీద 18. కుడి మోకాలు మీదపుట్టు మచ్చలు ఉన్న భోగభాగ్యములు సకలైశ్వర్యములు తప్పక కలుగును.

## ఆకస్మిక ధనలాభమును కలిగించు పుట్టుమచ్చలు

1. నుదురుభాగం విశాలంగా ఉండికుడివైపు పుట్టుమచ్చఉన్నచో అనుకోకుండా ధనప్రాప్తి. 2.కుడికణతమీదఉన్న లాటరీలు వలన లేదా వారసత్వమువలన కాని ఆకస్మిక ధనలాభములు కలుగును. ఈమచ్చ స్పష్టముగాను, ఉబ్బెత్తుగాను ఉండవలెను. 3. కుడికంటిలో భోగభాగ్యములు అనుభవించెదరు. 4. కంఠమునకు పై భాగము నందు ఉన్న వారసత్వమువలన గాని బంధుమూలకముగాగాని ధనప్రాప్తి కలుగును. 5. కుడిఅరచేతి ఎడమభాగమున ఉన్నచో ఏవిధమైన ప్రయత్నములు చేయకనే గుర్రప్పందెములందు లేదా లాటరీలలో విజయం కలిగి ధనలాభములు కలుగును. 6. కుడితొడ మీద పుట్టుమచ్చ ఉన్నయెడల భార్యవలన గాని పరస్త్రీ మూలకముగా గాని ఆస్తిలభించును. 7.కుడి కనుబొమ్మ మీదఉన్నయెడల భార్యవలన ఆస్తిలభించును. లేదా భార్య వచ్చిన తరువాత డబ్బు బాగా సంపాదించగలరు. లేని యెడల పరస్త్రీల వలన గాని ధనప్రాప్తి కలుగును.





# రజస్వల విషయములు



స్త్రీలుఅశ్విని,రోహిణి,మృగశిర,పుష్యమి,ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రము లందు ప్రథమరజస్వల అయినచాలామంచిది. సంతానసౌఖ్యములు, మంచిభర్తను పొందుదురు.

భరణి, కృత్తిక, ఆరుద్ర, పునర్వసు, ఆశ్లేష, మఖ, పుబ్బ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఈనక్షత్రములందు ప్రథమరజస్వలఅయిన దోషము. మంచిదికాదు. వివాహములందు కొన్నిఇబ్బందులు తప్పక కలుగును.

ఉదయమునందు గాని, మధ్యాహ్నము నందు గాని తెల్లదైన, గట్టిదైన వస్త్రము ధరించియుండగా ప్రథమరజస్వల అయిన కన్యకు సుఖము, సౌఖ్యము, పుత్రసంతానము, సంతానాభివృద్ధి, అన్నివిధముల అభివృద్ధి తప్పకకలుగును. ముందు పుత్రసంతానం, సుమంగళి యోగప్రాప్తి.

**మాసములు :** చైత్రం,జ్యేష్ఠం,ఆషాఢం,భాద్రపదం,కార్తీకం, పుష్యమాసము లందుగాక మిగిలినమాసములలో స్త్రీలు రజస్వలఅయిన మంచిది.

**తిథులు :** పాడ్యమి,చవితి, షష్టి అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య ఈతిథులందుగాక మిగిలిన తిథులందురజస్వలఅయిన మంచిది.

**వారములు :** ఆది, మంగళ, శనివారం గాక మిగిలినవారములందు రజస్వలఅయిన మంచిది. సుఖసౌఖ్యములు, మంచిభర్త లభించును.

**లగ్నములు :** మేషము, సింహము, వృశ్చికము, మకరం, కుంభ లగ్నములు గాకమిగిలిన లగ్నములందు రజస్వల అయిన మంచిది. రజస్వల సమయం ముఖ్యముగానోటచేసుకొని రజోలగ్నమును నిర్ణయించి జాతకఫలితములు చెప్పిన అతిబుజువుగా ఆమెజీవితంలో సరిపోవును.

**వస్త్రము :** నీలివస్త్రము,రక్తవస్త్రము,చిత్రవస్త్రము,జీర్ణవస్త్రము,వస్త్రములేకు ండుటగాకమిగిలినరంగులుగలవస్త్రములందురజస్వలఅయినమంచిది.

**స్థానములు :** ఇతరుల గృహములు, ఇతర గ్రామములందును, మార్గ మధ్యమందునుగాక,స్వగృహమందేరజస్వలఅయినమంచిది.

**ప్రారంభ దిన నిర్ణయం :** స్త్రీలురజస్వలఅయినప్పుడుగాని, ప్రసవించి నప్పుడుగాని మైలకలిగినపుడుగాని రాత్రిప్రమాణమును మూడు భాగ ములుగాచేసిఅందుమొదటిరెండుభాగములలో అయిన పూర్వదినము (ముందురోజు) అనియు మూడవభాగమైన మరుసటిదినం అనియు లెక్కింప వలయును.

# మరణ సంబంధ విషయములు

రోహిణి, మృగశిర పునర్వసు, మఘ, ఉత్తర, చిత్ర, విశాఖ,ఉత్తరాషాఢ,ధనిష్ఠశతభిషం,పూర్వాభాద్ర,ఉత్తరాభాద్ర, రేవతినక్షత్రములందును పాడ్యమి, విదియ, షష్ఠి, అష్టమి, ఏకాదశి,ద్వాదశి, త్రయోదశి,చతుర్దశి, అమావాస్యతిథులందునూ,ఆది,మంగళ, శుక్ర,శనివారములందును మరణంకలిగినదోషంమంచిదికాదు. కేవలం తిథివలన అర్ధదోషము వార, నక్షత్రంవలనత్రిపాదదోషం తిథి వార నక్షత్రముల వలనసంపూర్ణ దోషం.

రోహిణి, మృగశిర, మఘ, చిత్రనక్షత్రములందు గృహమునందు మరణించిన 3మాసములు, కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ నక్షత్రములందు గృహమునందు మరణించిన 6 మాసములు ఆ గృహం విడువవలెను. తదుపరి ఉదకశాంతి యిత్యాదిశాంతులు చేసుకొని ఆ యింటిలో ప్రవేశించవలెను.

## ఈ విషయము గురించి మృతకాల చక్రానుసారము నడిచేది




మరణంరోజున రవి ఏనక్షత్రమునందుండెనోఅదిమొదలు ఈశాన్యదిక్కునుండితూర్పు దిశగామూల దిక్కులందు మూడు నక్షత్రములునూ 4 దిక్కులందునాల్గేసినక్షత్రము లందునూఆరోహణావరోహణక్రమములో వ్రాయవలెను. రవి లగాయతు లెక్కింపగా మృతకాలనక్షత్రముచక్రమునకుమధ్యనఉంటే ఆ గృహము 45 రోజుల విడువవలెను. దానికి చుట్టూ ఉన్న 8వ గదిలో ఉన్నచో30 రోజులు వదిలివేయవలెను. దానికి చుట్టూ ఉన్న ప్రహరీలో ఉన్న ఇంటివార్కి దోషములేదు దోష నక్షత్రములందు మరణం కలిగిననూ ఆ ఇల్లు ఖాళీచేయనవసరం లేదు. ఇంటిలో గాక, ఇంటి యొక్క ఖాళీస్థలములోనూ బయట ప్రదేశము లందునూ చెడు తిథి, నక్షత్ర,వారములందు మరణించిననూ గృహం ఖాళీచేయనవసరం లేదు.





## శిశు జనన నక్షత్ర పాద దోషములు

| నక్షత్రములు | 1వ పాదం | 2వ పాదం | 3వ పాదం | 4వ పాదం |
|---|---|---|---|---|
| అశ్విని | శిశువుకు,తండ్రికి | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | తల్లికి,తండ్రికి | మంచిది |
| కృత్తిక | మంచిది | మంచిది | తల్లికి,తండ్రికి | మంచిది |
| రోహిణి | తల్లికిమేనుగండం | తల్లికిమేనుగం | మేనమామకు | మంచిది |
| మృగశిర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఆరుద్ర | మంచిది | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | తల్లికి,తండ్రికి | తల్లికి,తండ్రికి | మంచిది |
| ఆశ్లేష | స్వల్పదోషం | ధనహాని | తల్లికి,తండ్రికి | స్వల్పదోషం |
| మఘ | శిశుగండం | మంచిది | తల్లికి,తండ్రికి | మంచిది |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| ఉత్తర | తల్లికి,తండ్రికి | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| హస్త | మంచిది | మంచిది | తల్లికి,తండ్రికి | మంచిది |
| చిత్ర | తల్లికి,తండ్రికి | తల్లికి,తండ్రికి | స్వల్పదోషం | సామాన్యదోషం |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | బంధుగండం | బంధుగండం | విశేషశాంతి | విశేషశాంతి |
| అనూరాధ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| జ్యేష్ఠ | సౌఖ్యహాని | ధననష్టం | తండ్రికిగండం | సోదరగండం |
| మూల | తల్లికి,తండ్రికి | తండ్రికిగండం | ధనహాని | మంచిది |
| పూర్వాషాఢ | మంచిది | మంచిది | తల్లికి,తండ్రికి | మంచిది |
| ఉత్తరాషాఢ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శతభిషం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పూర్వాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| ఉత్తరాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | శిశుగండం |

### శాంతి విధానము

శిశువు అమావాస్యసమయములందుగాని,వర్జ్య,దుర్ముహూర్త సమయములందుగాని ప్రేగులు మెడకు చుట్టుకుని జన్మించినలేదా తల్లి తండ్రులు సోదర సోదరీల జన్మనక్షత్రములందు జన్మించిన తప్పకశాంతి చేయవలెను. నవగ్రహజపములు దానములు, నవగ్రహహోమము, నక్షత్ర శాంతి, రుద్రాభిషేకములు, అమ్మవారికి కుంకుమార్చన చేయాలి.

# శాంతి నక్షత్రములు

అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, ఆరుద్ర, పుష్యమి, ఆశ్రేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రేవతి ఈ 18 శాంతి నక్షత్రములు. వీటిలో జ్యేష్ఠ మిక్కిలి దోషం. జ్యేష్ఠ చివరి4ఘడియలు మూల ప్రారంభమందలి 4 ఘడియలు అత్యంత దోషం.

పుష్యమి 2 పాదం కర్కాటక లగ్నం, పూర్వాషాఢ 3వ పాదం ధనుర్లగ్నం, చిత్ర 2వ పాదం కన్యలగ్నం, ఉత్తర 1వ పాదం సింహలగ్నమునందు పగలు పుత్రజననం తండ్రికి, రాత్రి పుత్రికజననం తల్లికి గండం.

మరియు బహుళ చతుర్దశి, అమావాస్య సంధ్యాకాలం గ్రహణ సమయం,వర్జ్యదుర్ముహూర్తములందు తల్లితండ్రిసోదరుడు వీరినక్షత్ర ములందు జననమైన మిక్కిలిదోషం, తప్పక శాంతిజరపాలి.

**లగ్నసంధి:** సాధారణముగా ఏ లగ్నమునందయినను 30 ఘడియలు (12ని) ఆదియందునూ అంత్యమందునూ జన్మించిన "లగ్నసంధి" అందురు. ఈ లగ్నసంధియందు జన్మించిన 6 నెలల లోపున ఆరోగ్య భంగములుకలిగి తండ్రికి అధిక ధనవ్యయం తప్పకకలుగును. మరియు మీన - మేషములకు, కర్కాటక - సింహములకు, వృశ్చిక - ధనుస్సులకు గలసంధి 1 ఘడియ (24ని॥) లగ్నసంధికాలములని అందురు.

## 27 నక్షత్రములకు చేయవలసిన నక్షత్రశాంతి వివరము

| నక్షత్రం | శాంతి | నక్షత్రం | శాంతి | నక్షత్రం | శాంతి |
|---|---|---|---|---|---|
| అశ్వి | బంగారం దానం | మఘ | వెండి గుఱ్ఱం | మూల | ఎనుబోతు |
| భర | దానం లేదు | పుబ్బ | లేదు | పూ.షా | లేదు |
| కృత్తి | అన్నదానం | ఉత్త | నువ్వులపాత్ర | ఉ.షా | లేదు |
| రోహి | నవగ్రహహోమం నువ్వుల దానం | హస్త | లేదు | శ్రవ | లేదు |
| మృగ | లేదు | చిత్త | వస్త్రదానం | ధని | లేదు |
| ఆరు | లేదు | స్వాతి | లేదు | శత | లేదు |
| పున | లేదు | విశా | అన్నదానం | పూ.భా | లేదు |
| పుష్య | గంధపుచెక్క | అనూ | లేదు | ఉ.భా | లేదు |
| ఆశ్రే | అన్నదానం | జ్యేష్ఠ | గోదానం | రేవ | బంగారం దానం |

## నవవిధ శాంతులు

శాంతి నక్షత్రమందు శిశుజననం అయినప్పుడు, దోష నక్షత్రములందు స్త్రీలు రజస్వల అయినపుడు ఈక్రింది శాంతులు చేయవలెను.

1. తైలావలోకనం (నీడలుచూచుట)
2. రుద్రాభిషేకం
3. సూర్యనమస్కారములు
4. మహామృత్యుంజయ జపం
5. పైన చెప్పిన నక్షత్రదానం - జపం
6. నవగ్రహజపం - దానములు
7. హోమము (పూర్ణాహుతి)
8. సువాసినీ పూజ (ముత్తైదువపూజ)

వీటి అనంతరం తగు మంది బ్రాహ్మణులకు అన్నదానం చేయవలెను.





# ప్రయాణ విషయములు

## మంచి నక్షత్రములు



అశ్విని,రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి,మఘ,హస్త,అనూరాధ,మూల, శ్రవణం, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి.

## మంచితిథులు

శుక్లపక్షంమరియుబ॥పక్షంనందును,విదియ,తదియ,పంచమి,సప్తమి,దశమి, ఏకాదశిమరియు,శుక్లపక్షత్రయోదశితిథులుమంచివి, ఏరోజు ఏదిక్కుకు ప్రయాణంచేయుదుమోదానిప్రకారం చూసుకోవలెను.

## ప్రయాణ విషయమై తిథి, వారశూలలు పనికిరానివి

**తూర్పునకు :** పాఢ్యమి, నవమి తిథులు సోమ, శనివారములు, జ్యేష్ఠ ధనిష్ఠ నక్షత్రములు,తుల, కుంభ లగ్నములు మంచివికావు.

ధనిష్ఠ నక్షత్రములు,తుల, కుంభ లగ్నములు మంచివికావు. ధనిష్ఠ నక్షత్రములు,తుల, కుంభ లగ్నము మంచిదికాదు

**ఈశాన్యంకు :** అష్టమి,అమావాస్యతిథులు,బుధవారం,మిథునలగ్నం మంచిదికాదు

**ఉత్తరమునకు :** విదియ, దశమితిథులు,మంగళ,బుధవారములు పుబ్బ,హస్త నక్షత్రములు, వృషభ, కన్యాలగ్నములు పనికిరావు.

**వాయువ్యమునకు :** సప్తమి, పూర్ణిమ తిథులు, ఆది, మంగళవారములు మేష లగ్నము పనికిరావు.

**పడమరకు :** షష్ఠి,చతుర్దశితిథులు,ఆది,శుక్రవారములు, రోహిణి, పుష్యమి నక్షత్రములు, సింహ, ధనుర్లగ్నములు మంచివికావు.

**నైఋతినకు :** చవితి, ద్వాదశి తిథులు, సోమ, శుక్రవారములు, కర్కాటక లగ్నము మంచివికావు.

**దక్షిణమునకు :** పంచమి,త్రయోదశితిథులు, గురువారం అశ్విని, శ్రవణ నక్షత్రములు, వృశ్చిక, మీన లగ్నములు మంచివి కావు.

**ఆగ్నేయమునకు :** తదియ, ఏకాదశి తిథులు, గురు, శనివారములు మకరలగ్నంమంచివికావు.

ముఖ్యముగాయాత్రకువెళ్ళువారుపైప్రకారముచూసుకొనివెళ్లవలెను.

## ప్రయాణమునకు దగ్ధయోగములు

శుక్లపక్షంమరియుబహుళపక్షంనందునుతదియబుధవారం,పంచమి మంగళవారం,షష్ఠిగురువారం,అష్టమిశుక్రవారం,నవమిశనివారం, ఏకాదశిసోమవారం,ద్వాదశిఆదివారం ఇవిప్రయాణమునకే కాకుండా ఇతర కార్యములకుకూడా వర్జింపవలెను.

## తెల్లవారు ఝామున ప్రయాణములకు వారశూల దోషములేదు

తెల్లవారుఝామునవారశూలదోషంలేదు గాన తెల్లవారుఝామున4గం॥ నుండిసూర్యోదయంలోపుగాఏదిక్కుకైనాప్రయాణంచేయవచ్చును. ఏవిధమైనదోషంలేదు.ఇదికేవలంప్రయాణాలందుమాత్రమే చూడవలెను.

## ప్రయాణ విషయమై ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | యోగములు |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | శత | ఆనందాది-కార్యజయం |
| భర | ఆరు | మఖ | చిత్ర | జ్యేష్ఠ | అభి | పూ.భా | కాలదండ-మృత్యుభయం |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | దూమ్ర-కార్యభంగం |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | ధాత్రి - కార్యజయం |
| మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | సౌమ్య - సర్వసౌఖ్యం |
| ఆరు | మఖ | చిత్ర | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ధ్వాంక్ష - ధననష్టం |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | ధ్వజ - కార్యజయం |
| పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | శ్రీవత్స - ధనలాభం |
| ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | వజ్ర - ఫలప్రాప్తి |
| మఖ | చిత్ర | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | ముద్గర - కలహం |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | ఛత్ర - స్త్రీలాభం |
| ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర - సన్మిత్రలాభం |
| హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | మానస - కార్యలాభం |
| చిత్ర | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | మఖ | పద్మ - ఐశ్వర్యప్రాప్తి |
| స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | లంబన - చికాకులు |
| విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ఉత్పాత - కష్టములు |
| అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | మృత్యు- మృత్యుభయం |
| జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | మఖ | చిత్ర | కాల-అవమానం |
| మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధి - ధనప్రాప్తి |
| పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | శుభ - కార్యజయం |
| ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | అమృత- కార్యసిద్ధి |
| అభి | పూ.భా | భర | ఆరు | మఖ | చిత్ర | జ్యేష్ఠ | ముసల - దుఃఖం |
| శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదా - చెరుపు కల్గును |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | మాతంగ - అశ్వలాభం |
| శత | అశ్వి | మృగ | ఆశ్రే | హస్త | అనూ | ఉ.షా | రాక్షస - మిత్ర కలహం |
| పూ.భా | భర | ఆరు | మఖ | చిత్ర | జ్యేష్ఠ | అభి | చర - దుర్వార్తలు వినుట |
| ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థిర - శుభాశుభ మిశ్రమం |
| రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | వర్ధమాన - శివదర్శనం |





## గౌరీ పంచాంగము

| | | | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పగటి ముహూర్తములు | ఒక్కొక్కటి 1 1/2 గం॥ ప్రమాణం | 1 | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| | | 2 | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| | | 3 | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| | | 4 | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహ | ఉద్యో |
| | | 5 | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| | | 6 | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | శుభం | లాభం |
| | | 7 | అమృ | లాభం | విషం | ధనం | కలహ | ధనం | ధనం |
| | | 8 | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |
| రాత్రి ముహూర్తములు | ఒక్కొక్కటి 1 1/2 గం॥ ప్రమాణం | 1 | శుభం | రోగం | జ్వరం | లాభం | శుభం | అమృ | విషం |
| | | 2 | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| | | 3 | జ్వరం | ఉద్యో | కలహ | విషం | కలహ | కలహ | శుభం |
| | | 4 | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| | | 5 | కలహ | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహ |
| | | 6 | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| | | 7 | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| | | 8 | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

### రాహు కాలము

| | | | | |
|---|---|---|---|---|
| ఆది | మధ్యా | 4-30 | లగా | 6-00 |
| సోమ | ఉద | 7-30 | లగా | 9-00 |
| మంగ | మధ్యా | 3-00 | లగా | 4-30 |
| బుధ | మధ్యా | 12-00 | లగా | 1-30 |
| గురు | మధ్యా | 1-30 | లగా | 3-00 |
| శుక్ర | ఉద | 10-30 | లగా | 12-00 |
| శని | ఉద | 9-00 | లగా | 10-30 |

### గుళిక కాలము

| | | | | |
|---|---|---|---|---|
| ఆది | మధ్యా | 3-00 | లగా | 4-30 |
| సోమ | మధ్యా | 1-30 | లగా | 3-00 |
| మంగ | మధ్యా | 12-00 | లగా | 1-30 |
| బుధ | ఉద | 10-30 | లగా | 12-00 |
| గురు | ఉద | 9-00 | లగా | 10-30 |
| శుక్ర | ఉద | 7-30 | లగా | 9-00 |
| శని | ఉద | 6-00 | లగా | 7-30 |

### యమ గండము

| | | | | |
|---|---|---|---|---|
| ఆది | మధ్యా | 12-00 | లగా | 1-30 |
| సోమ | ఉద | 10-30 | లగా | 12-00 |
| మంగ | ఉద | 9-00 | లగా | 10-30 |
| బుధ | ఉద | 7-30 | లగా | 9-00 |
| గురు | ఉద | 6-00 | లగా | 7-30 |
| శుక్ర | మధ్యా | 3-00 | లగా | 4-30 |
| శని | మధ్యా | 1-30 | లగా | 3-00 |

ఇందు శుభకర్మలు చేయరాదు. ఇవి మద్రాసు ప్రాంతముల వారికి ఆచారము

## ప్రతిరోజు ఉదయాది గ్రహముల ఫలితాంశము కాలచక్రము (హోరలు)

| పగటి హోరలు | 1 (6-7) | 2 (7-8) | 3 (8-9) | 4 (9-10) | 5 (10-11) | 6 (11-12) | 7 (12-1) | 8 (1-2) | 9 (2-3) | 10 (3-4) | 11 (4-5) | 12 (5-6) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. ఆదివారము | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని |
| 2. సోమవారము | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి |
| 3. మంగళవారము | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర |
| 4. బుధవారము | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| 5. గురువారము | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| 6. శుక్రవారము | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| 7. శనివారము | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |

| రాత్రి హోరలు | 1 (6-7) | 2 (7-8) | 3 (8-9) | 4 (9-10) | 5 (10-11) | 6 (11-12) | 7 (12-1) | 8 (1-2) | 9 (2-3) | 10 (3-4) | 11 (4-5) | 12 (5-6) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. ఆదివారము | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| 2. సోమవారము | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| 3. మంగళవారము | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |
| 4. బుధవారము | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని |
| 5. గురువారము | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి |
| 6. శుక్రవారము | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర |
| 7. శనివారము | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

ప్రతిరోజూ సూర్యోదయం, సూర్యాస్తమయం కాలమునుబట్టి ఒక గంట కలుపుకొని ఫలములు చూడాలి.





## హోరాకాలంలో చేయుపనులు

**1. రవి :** రాజకీయవ్యవహారములందుపాల్గొనుటకు,నాయకులను కలుసుకొనుటకు,అధికార్లనుకలుసుకొనుటకు,క్రయవిక్రయములకు, ఉద్యోగ ప్రయత్నములకు, అప్పులకైధరఖాస్తు వ్రాయుటకు, కోర్టువ్యవహారముల నిమిత్తం దావాఅప్పీళ్ళు పెద్దర్లను కలుసుకొనుటకు, సాహసకార్యములకు యుద్ధవిద్యలు నేర్చుకొనుటకు నూతనవ్యవహారములకు మంచిది.

**2.చంద్ర:** కొత్తగాఉద్యోగములోచేరుటకు, కులపెద్దలను కలుసుకొనుటకు మధ్యవర్తిత్వములు చేయుటకు, స్త్రీలనుకలియుటకు, ఆభరణములు ధరించుటకు, కొత్తపాత్రలు వాడుకొనుటకు, ముత్యములు ధరించుటకు తెలుపు ధాన్యములు చల్లుటకు, స్థలమార్పులకు, జలసంబంధప్రయాణములకు, గృహసంబంధకార్యములు నిర్వహించుటకు మంచిది.

**3. కుజ :** సోదరసంబంధవిషయములకు,అగ్నిసంబంధపనులుచేయుటకు భూగృహసంబంధవిషయములు మాట్లాడుటకు, వాహనములు ఖరీదు చేయుటకుమంచిది. కొన్నింటికికష్టనష్టములు, విరోధం,చిక్కులుకలుగును. ఎలక్ట్రికల్‌పరికరములువాడుటకు, సాహసకృత్యములకు, వ్యవసాయ సంబంధపనులు ప్రారంభించుటకు, సేవకావృత్తిలోచేరుటకు మంచిది.

**4. బుధ:** కోర్టువ్యవహారములు ప్రారంభించుటకు, సమస్తవ్రాతపనులకు, రాయభారముచేయుటకు, సంగీత,జ్యోతిష,వాస్తు, శిల్ప, గణిత శాస్త్రములు నేర్చుకొనుటకు, బట్టలు, బంగారం వ్యాపారప్రారంభములకు బంగారు ఆభరణములు ధరించుటకు, వ్యాపారవ్యవహారములకు శుభకార్యాలకు, మంత్రశాస్త్రఅభ్యాసమునకు, రచనలకు మంచిది.

**5. గురు :** పెద్దవారిని దర్శించుటకు, యాత్రలకు వెళ్ళుటకు, కొత్తబట్టలు కొత్తవస్తువులువాడుటకు, పిల్లలను ఊయలలో వేయుటకు, యితరులకు సలహాలుచెప్పుటకు, ధనమునిల్వచేయుటకు, ఉద్యోగములోచేరుటకు వివాహసంప్రదింపులు చేయుటకు, క్రొత్తపుస్తకములుచదువుటకు, నూతన కార్యములు ప్రారంభించుటకు, ప్రయాణములకు మంచిది.

**6. శుక్ర :** నిశ్చయతాంబూలాలుయిచ్చిపుచ్చుకొనుటకు,పెండ్లిచూపులకు, తీర్థయాత్రలు చేయుటకు, వివాహ విషయములు మాట్లాడుటకు, రాజీలు సల్పుటకు, నూతనవాహనములు ఉపయోగించుటకు, స్త్రీ పురుషులు రతిక్రీడలలోపాల్గొనుటకు, విలాసవంతమైనఖర్చులు చేయుటకు శుభకార్యములకు, కళాసంబంధవిద్యలు అభ్యసించుటకు మంచిది.

**7. శని :** ఏవిధమైన శుభకార్యములు చేయరాదు. మరణసమయంలో పరామర్శించుటకు,సేవకావృత్తియందుప్రవేశించుటకు, తైలాభిషేకం చేయించుటకు యినుము,మినుములు, నువ్వులు, నూనె, లిక్కర్, యంత్ర పరికరములువంటి మొదలగు వ్యాపారప్రారంభములకు మంచిది. మిగిలిన ఏకార్యములుచేయుటకు మంచిదికాదు. యిబ్బందులు కలుగును.




Scanned with OKEN Scanner

# భార్గవ సిద్ధాంత పంచాంగము

ప్రతి రోజు సూర్యోదయం నుండి 24 ని॥ల చొప్పున ఫలితము చూడాలి. తిథి, వార, నక్షత్రములు చూడనవసరం లేదు. దీనిని అనుసరించుట శ్రేయోదాయకం

| గం॥ని॥ | గం॥ని॥ | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 6-00 | 6-24 | లాభం | వివాదం | ధనలాభం | దుర్వార్త | ధనలాభం | కార్యజయం | కష్టం |
| 6-24 | 6-48 | ధనలాభం | లాభం | సుఖం | మనోవ్యధ | కలహం | మిత్రలాభం | సుఖం |
| 6-48 | 7-12 | కలహం | క్షేమం | భయం | ధనలాభం | భయం | ధనలాభం | విరోధం |
| 7-12 | 7-36 | అనారోగ్యం | ధనలాభం | కష్టములు | కార్యజయం | శుభం | శుభం | ధనలాభం |
| 7-36 | 8-00 | చోరభయం | భూలాభం | జయం | భయం | కార్యసిద్ధి | విరోధం | జయం |
| 8-00 | 8-24 | శత్రువృద్ధి | ధననష్టం | సుఖం | సుఖం | కార్యజయం | జయం | కార్యజయం |
| 8-24 | 8-48 | కార్యసిద్ధి | కార్యసిద్ధి | సుఖం | సుఖం | ధనలాభం | హాని | కార్యలాభం |
| 8-48 | 9-12 | సుఖం | వస్తుప్రాప్తి | భయం | భీతి | లాభం | స్నేహం | సన్మానం |
| 9-12 | 9-36 | క్షేమం | ఇష్టసిద్ధి | విరోధం | ధనలాభం | కలహం | అశుభం | కార్యసిద్ధి |
| 9-36 | 10-00 | మిత్రవృద్ధి | సుఖం | మనోభయం | మిశ్రమఫలం | కార్యజయం | మిశ్రమఫలం | అనారోగ్యం |
| 10-00 | 10-24 | కార్యభంగం | స్త్రీలాభం | సుఖం | కార్యసిద్ధి | వృద్ధిలాభం | సౌఖ్యం | సౌఖ్యం |
| 10-24 | 10-48 | సుఖం | కార్యసాధన | కార్యహాని | మిశ్రమఫలం | శుభం | ధనలాభం | సంతాపం |
| 10-48 | 11-12 | జయం | కార్యహాని | మిశ్రమఫలం | శుభం | ధనలాభం | క్షేమం | భయం |
| 11-12 | 11-36 | కార్యసిద్ధి | వివాదం | భయం | లాభం | ఆరోగ్యం | కార్యసిద్ధి | మిత్రప్రాప్తి |
| 11-36 | 12-00 | కలహం | కార్యసిద్ధి | కష్టము | శుభం | నష్టం | వాహనభీతి | జయం |
| 12-00 | 12-24 | ఇష్టసిద్ధి | ఇష్టలాభం | రోగపీడ | సౌఖ్యం | పనినష్టం | సుఖం | ధనలాభం |
| 12-24 | 12-48 | కార్యహాని | ధనలాభం | లాభం | ఫలసిద్ధి | విరోధం | భయం | శుభం |
| 12-48 | 1-12 | జయం | కార్యజయం | కార్యసిద్ధి | క్షేమం | కార్యసిద్ధి | శుభం | మిశ్రమఫలం |
| 1-12 | 1-36 | ఇష్టసిద్ధి | శుభం | కార్యహాని | మిశ్రమఫలం | బంధనము | సుఖహాని | కార్యసిద్ధి |
| 1-36 | 2-00 | సంతాపం | మిశ్రమఫలం | ఉద్యోగలాభం | వివాదం | హాని | ధనవ్యయం | కార్యజయం |
| 2-00 | 2-24 | ధనవ్యయం | శుభం | వ్యర్థం | ఇష్టసిద్ధి | కలహం | కార్యజయం | జయం |
| 2-24 | 2-48 | విరోధం | మనస్తాపం | కార్యహాని | లాభం | జయం | సౌఖ్యం | మిశ్రమఫలం |
| 2-48 | 3-12 | ధనలాభం | కార్యసిద్ధి | అపజయం | ఉద్యోగలాభం | కార్యభంగం | భయం | విరోధం |
| 3-12 | 3-36 | శత్రువృద్ధి | ప్రయాణం | శత్రుజయం | విజయం | అశుభం | కార్యహాని | రోగపీడ |
| 3-36 | 4-00 | కలహం | ధనలాభం | ధనవ్యయం | అభీష్టసిద్ధి | స్నేహం | నష్టం | మనస్తాపం |
| 4-00 | 4-24 | రోగం | విద్యాలాభం | సుఖం | శుభం | అధికజయం | అపవాదులు | లాభం |
| 4-24 | 4-48 | ధనలాభం | కార్యనష్టం | కార్యలాభం | క్షేమం | కలహం | భయం | కార్యసిద్ధి |
| 4-48 | 5-12 | కార్యసిద్ధి | గౌరవం | క్షేమం | జయం | మనోభీతి | పనినష్టం | లాభం |
| 5-12 | 5-36 | నష్టము | శుభం | కార్యసిద్ధి | ఉద్యోగలాభం | జయం | కార్యజయం | సుఖం |
| 5-36 | 6-00 | భూలాభం | అధికారలాభం | సౌఖ్యం | అశుభం | కార్యసిద్ధి | ధనలాభం | జయం |





## శ్రీ విశ్వావసునామ సంవత్సర చైత్రమాసం - వసంత ఋతువు - ఎండలు పెరుగును - జల్లులు

మార్చి / 2025 - ఏప్రియల్ నెల

| ఇం.తే. | గ్ర.త్రి | |
|---|---|---|
| 30 | వం | శుక్లపాడ్యమి ఆది ను.2.46 రేవతి రా.6.43 అమృ సా.4.28ల5.57 వ.ఉ.7.31ల9.02 దు.సా.4.32ల5.21 దినం30.23 ఘ.0.50 సూ.ఉ.6.01 సూ.అ.6.08 మేషసంక్రమణం రా.6.44 ఉగాది, తెలుగుసంవత్సరాది, శ్రీకాళంగనిర్ణయం, మాతంగతీపూజ, పంచాంగ శ్రవణం ... [illegible] |
| 31 | ర శు | విదియ సోమ ను.12.21 అశ్విని సా.5.04 అమృ ఉ.10.22 ల11.51 వ.ను.1.21నుండి 2.50 వ.రా.2.00ల3.29 దు.ను.12.28ల1.17 దు.ను.2.54ల3.43 దినం 30.23 ఘ.0.53 సూ.ఉ.6.00 సూ.అ.6.08 రేవతి1రవి ను.3.51 పూర్వాభాద్ర4వ శుక్ర ను.12.40 |
| 1 | వం | తదియ మంగళ ఉ.9.57 భరణి ను.3.26 అమృ ఉ.10.58ల12.28 వ.రా.2.38ల4.08 దు.ఉ.8.27ల9.14 దు.రా. 10.52 ల11.39 దినం 30.28 ఘ.0.56 సూ.ఉ.6.00 సూ.అ.6.09 ... రా.9.02, ... |
| 2 | శు | చవితి బుధ ఉ.7.37 పంచమి రా.తె.5.12 కృత్తిక ను.1.52 అమృ ఉ.11.39ల1.09 వ.తె.4.54ల దు.ఉ.11.40ల12.29 దినం 30.30 ఘ.0.59 సూ.ఉ.5.59 సూ.అ.6.09 ప్రాగుదిత్ శని ... |
| 3 | ర గు బు వం | షష్ఠి గురు రా.తె.3.21 రోహిణి ను.12.27 అమృ ఉ.9.26ల10.57 అమృ తె.2.54ల4.26 వ.ఉ.6.26వరకు వ.సా.5.47 ల7.17 దు.ఉ.10.02ల10.50 దు.ను.2.55ల3.43 దినం 30.31 ఘ.1.02 సూ.ఉ.5.58 సూ.అ.6.09 రేవతి 2రవి |
| 4 | | రా.1.07 మృగశిర 1 గురు రా.1.13 పూర్వాభాద్ర 4 వక్ర బుధ రా.6.55 ... రా.11.53, ... సప్తమి శుక్ర రా.1.39 మృగశిర ఉ.11.18 అమృ రా.12.48ల2.21 వ.రా.7.24ల8.56 దు.ఉ.8.23ల9.12 దు.ను. 12.28 ల1.17 దినం 30.34 ఘ.1.06 సూ.ఉ.5.57 సూ.అ.6.09 ... |
| 5 | బు వం | అష్టమి శని రా.12.23 ఆర్ద్ర ఉ.10.28 అమృతేదు. వ.రా.10.15ల11.49 దు.ఉ.7.33వరకు దినం 30.37 ఘ.1.09 సూ.ఉ.5.56 సూ.అ.6.09 ప్రాగుదిత్ బుధ, ... తె.4.09, ... |
| 6 | | నవమి ఆది రా.11.29 పునర్వసు ఉ.10.02 అమృ ఉ.7.41 ల9.16 అమృ తె.3.38ల5.14 వ.సా.6.03ల7.37 దు.సా.4.32 ల5.21 దినం 30.40 ఘ.1.12 సూ.ఉ.5.55 సూ.అ.6.09 ఆందరికీ శ్రీరామనవమి, ... |
| 7 | ర | దశమి సోమ రా.11.03 పుష్యమి ఉ.10.02 అమృతేదు. వ.రా.11.04ల12.42 దు.ను.12.27ల1.16 దు.ను.2.54ల 3.43 దినం 30.43 ఘ.1.15 సూ.ఉ.5.54 సూ.అ.6.09 రేవతి 3 రవి ఉ.10.17 ధర్మరాజదశమి, ... |

## 2025 - ఏప్రియల్ నెల

| తేది | గ్రహ | వివరాలు |
|---|---|---|
| 8 | కు బు చం | ఏకాదశి మంగళ రా. 11.11 ఆశ్రేష ఉ. 10.31 అమృ ఉ. 8.53ల10.30 వ.రా. 11.00ల12.40 దు.ఉ. 8.23ల9.09దు.రా. 10.49ల11.36 దినం 30.45 భు. 1.18 సూ.ఉ. 5.53 సూ.అ. 6.09 పుష్యమి1కుజ రా. 11.30 బుధునికి వక్రంఆఖరు |
| 9 | | రా. 11.34 **సింహచంద్ర ఉ. 10.32 అందరికీ ఏకాదశి,వాడపల్లితీర్థం,** (దినం 30.48 భు. 1.21 సూ.ఉ. 5.53 సూ.అ. 6.10 **వామనద్వాదశి** ద్వాదశి బుధ రా. 11.46 మఖ ఉ. 11.31 అమృ ఉ. 9.01ల10.41 వ.రా. 7.59ల9.41 దుర్ముహూర్తం ఉ. 11.37ల12.27 |
| 10 | ర శు చం | త్రయోదశి గురు రా. 1.26 పుబ్బ మ. 12.58 అమృ ఉ. 6.11ల7.53 వ.రా. 8.43ల10.29 దు.ఉ. 9.58ల10.48దు.మ. 2.54ల3.44 దినం 30.50 భు. 1.24 సూ.ఉ. 5.52 సూ.అ. 6.10 రేవతి4రవి మ. 1.40 పూర్వాభాద్ర3వక్ర కుంభ శుక్ర |
| 11 | | రా. 10.00 **కన్య చంద్ర రా. 7.27 అనంగత్రయోదశి, మహావీరజయంతి, అనంతపురం, బళ్ళారి ప్రాంతాలలో ప్రమాదాలు.** చతుర్దశి శుక్ర రా. 2.24 ఉత్తర మ. 2.54 అమృ ఉ. 7.08ల8.51 వ.రా. 12.04ల1.49 దు.ఉ. 8.20ల9.09 దు.మ. 12.27 ల1.16 దినం 30.52 భు. 1.27 సూ.ఉ. 5.52 సూ.అ. 6.10 **శైవచతుర్దశి, కర్దమక్రీడ, నిజామాబాద్ప్రాంతంలో ప్రమాదం.** |
| 12 | | ○ పూర్ణిమ శని రా.తె. 4.18 హస్త సా. 5.11 అమృ ఉ. 10.38ల12.23 వ.రా. 1.58ల3.44 దు.ఉ. 7.29వరకు దినం 30.55 భు. 1.30 సూ.ఉ. 5.52 సూ.అ. 6.10 **ఒంటిమిట్టలో శ్రీసీతారాములకళ్యాణం,హనుమద్విజయోత్సవం,అక్కమహాదేవివిజయంతి** |
| 13 | ర శు బు చం | బ॥పాడ్యమి ఆది పూర్తి (24-00) చిత్ర రా. 7.40 అమృ మ. 12.38ల2.24 వ.మ. 1.52ల3.39 దు.సా. 4.34ల5.24 దినం 30.57భు. 1.33 సూ.ఉ. 5.51 సూ.అ. 6.10 అశ్వని1మేషరవి రా.తె. 5.37 శుక్రునికివక్రంఆఖరు సా. 4.31 ఉత్తరాభాద్ర1బుధ ఉ. 10.34 **తులచంద్ర ఉ. 6.26** |
| 14 | | పాడ్యమి సోమ ఉ. 6.24 స్వాతి రా. 10.18 అమృ మ. 12.35ల2.22 వ.తె. 4.30లగా దు.మ. 12.26ల1.16 దు.మ. 2.55ల 3.45 దినం 31.00 భు. 0.00 సూ.ఉ. 5.51 సూ.అ. 6.11 **మేషసంక్రాంతి, తమిళసంవత్సరాది, ఉష్ణోగ్రతలు హెచ్చును.** |
| 15 | శు చం | విదియ మంగళ ఉ. 8.29 విశాఖ రా. 12.51 అమృ మ. 3.10ల4.57 వ.ఉ. 6.19వరకు వ.తె. 5.14ల దు.ఉ. 8.21ల9.07 దు.రా. 10.49ల11.35 దినం 31.02 భు. 0.04 సూ.ఉ. 5.50 సూ.అ. 6.11 పూర్వాభాద్ర4మీనశుక్ర రా.తె. 4.18 **వృశ్చికచంద్రసా. 6.18** |
| 16 | | తదియ బుధ ఉ. 10.23 అనూరాధ రా. 3.10 అమృ సా. 3.49ల5.34 వ.ఉ. 6.18వరకు దు.ఉ. 11.35ల12.25 దినం 31.04 భు. 0.07 సూ.ఉ. 5.49 సూ.అ. 6.11 **సంకటహర చతుర్థి, అగ్నిప్రమాదములు, ఆస్తినష్టం, ఉదుకు, ఉక్కపోత.** |
| 17 | ర కు బు శ చం | చవితి గురు మ. 12.00 జ్యేష్ఠ రా.తె. 5.10 అమృ రా. 7.38ల9.22 వ.ఉ. 9.17ల11.01 దు.ఉ. 9.55ల10.45దు.మ. 2.54 ల3.44 దినం 31.06 భు. 0.10 సూ.ఉ. 5.48 సూ.అ. 6.11 అశ్వని 2 రవి మ. 3.10 పుష్యమి2కుజ రా. 1.13 ఉత్తరాభాద్ర 2 బుధ రా. 12.41 పూర్వాభాద్ర 4 మీనశని రా.తె. 4.17 **ధనుషిచంద్ర తె.5.11, ఉష్ణోగ్రతలు పెరుగును. ప్రమాదములు.** |
| 18 | | పంచమి శుక్ర మ. 1.11 మూల పూర్తి (24-00) అమృ రా. 11.46ల1.28 వ.మ. 1.40ల3.22 వ.తె. 4.51ల దు.ఉ. 8.15 ల9.05 దు.మ. 12.24ల1.14 దినం 31.09 భు. 0.14 సూ.ఉ. 5.47 సూ.అ. 6.11 **మత్స్యజయంతి, మేఘాడంబరం.** |





## 2025 - ఏప్రియల్ నెల

| తేది | గ్రహ | వివరాలు |
|---|---|---|
| 19 | | షష్ఠి శని మ. 1.56 మూల ఉ. 6.34 అమృ రా. 2.34ల4.14 వ.ఉ. 6.34వరకు వ.సా. 4.35ల6.13 దు.ఉ. 7.25వరకు దినం 31.10 భు. 0.17 సూ.ఉ. 5.46 సూ.అ. 6.12 |
| 20 | ర చం | సప్తమి ఆది మ. 2.08 పూర్వాషాఢ ఉ. 7.35 అమృ రా. 1.31ల3.09 వ.మ. 3.47ల5.25 దు.సా. 4.34ల5.24 దినం 31.14 భు. 0.21 సూ.ఉ. 5.46 సూ.అ. 6.12 అశ్విని3రవి రా. 1.16 **మకరచంద్ర మ. 1.43 భానుసప్తమి,ఉదుకు, ఎండ** |
| 21 | బు | అష్టమి సోమ మ. 1.50 ఉత్తరాషాఢ ఉ. 8.04 అమృ రా. 9.40ల11.16 వ.మ. 12.06ల1.42 దు.మ. 12.24ల1.14 దు.మ. 2.54ల3.44 దినం 31.16 భు. 0.24 సూ.ఉ. 5.45 సూ.అ. 6.12 ఉత్తరాభాద్ర 3 బుధ ఉ. 7.21 **గ్రీష్మంహెచ్చు** |
| 22 | గు చం | నవమి మంగళ మ. 1.04 శ్రవణం ఉ. 8.07 అమృ రా. 9.27ల11.01 వ.మ. 12.04ల1.38 దు.ఉ. 8.18ల9.04దు.రా. 10.48ల11.34 దినం 31.18 భు. 0.27 సూ.ఉ. 5.44 సూ.అ. 6.12 మృగశిర2గురు రా. 10.48 **కుంభచంద్ర రా. 7.55** |
| 23 | బు | దశమి బుధ ఉ. 11.50 ధనిష్ఠ ఉ. 7.42 అమృ రా. 11.55ల1.28 వ.మ. 2.41ల4.14 దు.ఉ. 11.33ల12.24 దినం 31.20 భు. 0.31 సూ.ఉ. 5.44 సూ.అ. 6.13 ఉత్తరాభాద్ర 4 బుధ రా. 1.29 **ఖమ్మం, భద్రాచలంలోవాహనప్రమాదములు.** |
| 24 | ర చం | ఏకాదశి గురు ఉ. 10.15 శతభిషం ఉ. 6.53 అమృ రా. 10.07ల11.39 వ.మ. 1.01ల2.33 దు.ఉ. 9.53ల10.43 దు.మ. 2.54 ల3.44 దినం 31.23 భు. 0.34 సూ.ఉ. 5.43 సూ.అ. 6.13 అశ్వని4రవి ఉ. 11.23 **మీనచంద్ర రా. 12.04 అందరికిఏకాదశి** |
| 25 | కు | ద్వాదశి శుక్ర ఉ. 8.20 పూర్వాభాద్ర ఉ. 5.46 ఉత్తరాభాద్ర రా.తె. 4.22 అమృ రా. 11.53ల1.23 వ.మ. 2.51ల4.21దు.ఉ. 8.12 ల9.03 దు.మ. 12.24ల1.14 దినం 31.25 భు. 0.37 సూ.ఉ. 5.42 సూ.అ. 6.14 పుష్యమి3కుజ రా.తె. 4.09 **వరాహజయంతి** |
| 26 | బు చం | త్రయోదశి శని ఉ. 6.12 చతుర్దశి రా.తె. 3.49 రేవతి రా. 2.47 అమృ రా. 12.32ల2.01 వ.మ. 3.38ల5.08 దు.ఉ. 7.22వరకు ది[illegible].27 భు. 0.41 సూ.ఉ. 5.42 సూ.అ. 6.13 రేవతి1బుధ మ. 1.00 **మేషచంద్ర రా. 2.48 మాసశివరాత్రి, శనిత్రయోదశి** |
| 27 | ర శు | ● [illegible]మావాస్య ఆది రా. 1.35 అశ్వని రా. 1.19 అమృ రా. 6.35ల8.05 వ.రా. 9.35ల11.05 దు.సా. 4.35ల 5.26 ది[illegible]1.29 భు. 0.44 సూ.ఉ. 5.42 సూ.అ. 6.14 భరణి 1 రవి రా. 9.43 ఉత్తరాభాద్ర 1 శుక్ర ఉ. 10.51 **ఉదకు** |

**శ్రీ విశ్వావసునామ సంవత్సర వైశాఖమాసం - వసంత ఋతువు - ఎండలు పెరుగును - అక్కడక్కడ వర్షములు**

| ఇం.తే. | గ్ర.ప్ర | వివరాలు |
|---|---|---|
| 28 | బు చం | శు[illegible]పాడ్యమి సోమ రా. 10.53 భరణి రా. 11.25 అమృ రా. 7.00ల8.28 వ.ఉ. 10.13ల11.42 దు.మ. 12.23ల1.13 [illegible] మ. 2.54ల3.45 దినం 31.31 భు. 0.47 సూ.ఉ. 5.41 సూ.అ. 6.14 రేవతి2 బుధ రా. 8.28 **వృషభచంద్ర తె. 5.01** |
| 29 | | [illegible]దియ మంగళ రా. 8.31 కృత్తిక రా. 9.50 అమృ రా. 7.35ల9.05 వ.ఉ. 10.41ల12.10 దు.ఉ. 8.16ల9.01 దు.రా. 10.48 ల11.33 దినం 31.33 భు. 0.51 సూ.ఉ. 5.40 సూ.అ. 6.14 **చంద్రదర్శనం, అగ్నిప్రమాదములు,నష్టం.** |





Scanned with OKEN Scanner

